

"యావద్భారత కర్షకోద్యమ విధాతా నీకు దీర్ఘా——"

శ్రీ తుమ్మల

కళాశాల వ్యవస్థాపకులు



శ్రీ కొలసాని వెంకటసుబ్బయ్య చౌదరి



మంచికి మారుపేరు — మహామనీషి

**శ్రీ కె. యమ్. మధుసూధనరావు, ప్రిన్సిపాల్**



శ్రీ రంగా దంపతులు




ది. 26-1-76 న సరస్వతీ విగ్రహావిష్కరణ సందర్భంలో
శ్రీ యన్.జి. రంగా, యడ్లపాటి వెంకట్రావుగార్లతో సుబ్బయ్యగారు, మధుసూదనరావుగారు



ఇందిరాగాంధీచే సన్మానం
50 సం॥ల పార్లమెంటరీ జీవిత పరిపూర్తి
సందర్భములో



నెహ్రూతో రంగాజి
అఖిల భారత కిసాన్ సమ్మేళనం 1957



శ్రీ రంగాగారి షష్టిపూర్తి ఊరేగింపు



సత్యాగ్రహోద్యమం



రాష్ట్ర గవర్నరు రాక



ఉపాధ్యాయ దినోత్సవం



పుణ్య దంపతులు :

కీ॥ శే॥ శ్రీ కొలపాని వెంకటసుబ్బయ్యచౌదరి

కీ॥ శే॥ శ్రీమతి రామతులసమ్మ





కళాశాల భవనాల కమనీయ దృశ్యాలు







TEACHING & NON - TEACHING STAFF OF COLLEGE & HIGH SCHOOL



SRI Y.L. NARASIMHA RAO
Vice Principal



SRI K. SRINIVASA RAO, B.A.
Vice Principal



SRI A. LAKSHMINARAYANA
B.Com. (Hons) A P.E.
Director



SRI GHANTA NARAYANA RAO
B A. B Ed.
Head Master



మా కంప్యూటర్ సెంటర్ ప్రారంభోత్సవము



విద్యార్థులకు కంప్యూటర్ కోర్సులలో శిక్షణ

# INTERMEDIATE RESULTS

## 1981 - 1988

## K.V.S.C. & S.R.R. RESIDENTIAL Jr. COLLEGE





**PREPARED BY ...**
COMPUTER CENTRE,
**S.R.R. COLLEGE,**
CHILUMURU - 522 301.

# ఆంధ్ర విభాగము



# విషయ సూచిక

# మహోద్యమ సంధానకర్త

# ఆచార్య రంగా

— వెల్లంకి చంద్రపాల్, ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము.

జాతీయోద్యమ కాలంనాటి అతిరథమహారథులలో మనకు మిగిలియున్న బహుకొద్దిమందిలో ఆచార్య రంగా ఒకరు. గాంధేయ తత్వం అత్యుత్తమ జీవన విధాన మని ప్రచారం చేస్తున్న రంగాజీ స్వచ్ఛమైన గాంధేయ వాది. సాకల్యమైన పరిజ్ఞానంతో, క్షుణ్ణమైన అధ్యయ నంతో "కిసాన్-మజ్దూర్-ప్రజారాజ్య" సిద్ధాంతాన్ని ఆపోసనం పట్టిన మహామేధావి. రాజకీయ, సాంఘిక జీవితంలో ఆశయానికి, ఆచరణకు మధ్య వారధికట్టి ఆ రెంటికిమధ్య అవిభాజ్యమైన అద్వైతాన్ని సాధించిన తెలుగుబిడ్డ రంగాజీ. రైతుకూలీ స్వయం వృత్తుల వారికొరకు ఉద్యమాన్ని నిర్మించిన ఆచార్య రంగాజీ 1926 లో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ నుండి బి.లిట్., తీసుకున్నారు. 1927-30 లో మద్రాస్ పచ్చయప్పా కళాశాలలో ఆర్థికశాస్త్రం, చరిత్ర పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సుల చీఫ్ ప్రొఫెసర్‌గా పనిచేశారు. అప్పుడు శ్రీ అన్నాదురై మరికొందరు ప్రముఖులు ఆ కళాశాలలో రంగాజీకి శిష్యులు. 1926 లో రంగాజీ మద్రాసు ప్రభుత్వ ఆర్థికసలహాదారుగా పనిచేశారు. 1926-29 లో బ్రిటీష్ ప్రభుత్వం నియమించిన రాయల్ కమీషన్ ముందు వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు నిర్ణ యించే చట్టం కావాలని ఆందోళన లేవదీశారు. శ్రీ రంగాజీ. అంతర్జాతీయ స్థాయి విద్యావేత్తగా, శేముషీ సంపన్నుడుగా, ప్రభుత్వ పక్షపాతిగా పూల పాన్పువంటి వైభవోపేతమైన జీవితం గడపవలసిన రంగాజీ సామాన్యమైన కర్షకకార్మికలోకంతోఅద్వైతం పొంది, ప్రజాబంధువుగా జాతీయోద్యమానికి అంకిత మయినారు. అది ఆయన త్యాగ పరాయణత్వానికి, చిత్తశుద్ధికి, ఆశయనిరతికి హిమాలయాగ్రం వంటిది. భారత స్వాతంత్ర్య ఉద్యమంలోని ఉజ్వలమైన, ఉత్తేజ కరమైన అధ్యాయాలుకొన్ని ఆనాటి కేంద్రశాసనసభలో పరిచితమైనవి. అరువది సంవత్సరాల క్రిందట యువ నాయకుడుగా, యువ మేధావిగా రంగాజీ ఆనాటి కేంద్ర పార్లమెంటులో శ్రీ రంగా నిర్వహించిన సమరోచిత పాత్ర చిరస్మరణీయమైనది. అటు తరువాత ఆచార్య రంగాజీ అఖిలభారతస్థాయి నాయకుడుగా, అంతర్జాతీయ ప్రసిద్ధ మేధావిగా, మహామనీషిగా, తాత్వికుడుగా జాతీయ జీవన రంగంలో పలు ప్రజాహిత సంస్థలు బహుముఖ సంపన్నమైనపాత్ర నిర్వహించారు. స్థాపించి ఆయనఅనేక ఉద్యమాలలో ఆరితేరిన యుద్ధమూర్తి.

1930 లో సత్యాగ్రహోద్యమానికి గాంధీజీ పిలుపును పురస్కరించుకొని ఆచార్య పదవికి రాజీనామా చేసి స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖనాయకులయ్యారు. 1633 లో దేశవ్యాప్తంగా రైతుకూలీ రక్షణ యాత్ర సాగించి, గ్రామీణ రైతు, వ్యవసాయ కూలీల స్వయం పోషకశక్తికి, విప్లవాత్మకమైన ఆర్థిక సూత్రాలు ప్రభో

దించిన మేధావి ఆచార్య రంగాజీ 1933 లో పూనా కాంగ్రెస్ సమావేశ సందర్భంగా శ్రీ జవహర్‌లాల్, శ్రీ జయప్రకాష్‌నారాయణ్, ఆచార్య నరేంద్రదేవ్, ఆచార్య ఎన్.జి. రంగా తదితరులు గోఖలే హాలులో సమావేశమై కాంగ్రెస్‌లో అంతర్భాగంగా రైతు కార్మికుల సంక్షేమానికి ఒక సోషలిస్టు ఫోరంను ఏర్పాటు గావించారు. శ్రీ రంగాజీ యీ ఫోరంలో కార్యవర్గ సభ్యులు. 1934-35 లో సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి ఆచార్య రంగా తిరిగి ఎన్నికయ్యారు. 1936 లో ఆచార్య రంగాజీ నాయకత్వంలో అఖిలభారత కిసాన్ కాంగ్రెస్ నిర్మాణమయింది. తెలుగు ప్రజలను చైతన్యవంతులుగా, ఉద్యమోన్ముఖులుగా చేసేందుకు 1936 లో "వాహిని" పత్రికను స్థాపించారు.

1937 లో కాంగ్రెస్ పార్టీ శాసనసభల ఎన్నికల్లో పాల్గొనాలని తీర్మానించడం జరిగింది. ఈ సందర్భంగా రంగాజీ రైతులకు ఒక పిలుపు యిచ్చారు. కాంగ్రెస్ అభ్యర్థులుగా పోటీచేసేవారు రైతుల రక్షణకు, రైతు సమస్యల పరిష్కారానికి కృషి చేస్తామని ప్రమాణ పత్రాన్ని ప్రకటించిన అభ్యర్థులనే భారత రైతాంగం సమర్థిస్తుంది అని ఆచార్య రంగాజీ ప్రకటించడం జరిగింది. దీనినిబట్టి రైతాంగ సమస్యలపట్ల రంగాజీకి గల ప్రత్యేక ఆసక్తి ఎలాంటిదో గ్రహించవచ్చు. ఎన్నికల తరుణంలో రంగాజీ గావించిన ప్రకటనలకు సర్దార్ పటేల్ ఆగ్రహించడం కూడా జరిగింది. కాని స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత సర్దార్ పటేల్, ఆచార్య రంగాజీ కలిసి రైతాంగ రక్షణకు పోరాటం సాగించారు. 1948 లో అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గంలో "ఆచార్య రంగాకు స్థానం కల్పించకపోతే, ఆ కార్యవర్గంలో నేను చేరేదిలేదు" అని సర్దార్ పటేల్ ప్రకటించారు. ఈ కారణంగా కార్యవర్గ నిర్మాణం నెల దినాలు వాయిదా పడింది. చివరకు రంగాజీని కార్యవర్గంలో చేర్చుకున్న తరువాత శ్రీ పటేల్ కార్యవర్గ సభ్యత్వాన్ని స్వీకరించారు. 1940-42 సం. జాతీయ సమరంలో రంగాజీ కారాగార క్లేశం అనుభవించారు. 1945 లో రైతుకూలీ రాజ్యం నినాదంమీద గాంధీజీతో చర్చలు జరిపి, గాంధీజీ ఆశీస్సులు పొందారు రంగాజీ. 1946-51 లో రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షులుగాను, కేంద్ర శాసనసభా కాంగ్రెస్ పార్టీ కార్యదర్శిగాను పనిచేశారు.

1947 తరువాత జాతీయ ప్రభుత్వం సవ్యంగా సాగటంలేదని గాంధీజీ అనేక సూచనలు, హెచ్చరికలు చేసిన విషయం అందరకు తెలిసినదే. ఈ విషయంలో ఆనాడు రంగాగారు గాంధీజీ మార్గాన్నే అనుసరించారు. భారత రాజకీయ రంగంలో కాంగ్రెస్ నాయకుడుగా ఆచార్య రంగాజీ ఆ పార్టీతో సిద్ధాంతపరమైన విభేదాలు అనేకం పడ్డారు. కాని కాంగ్రెస్ స్థానంలో కమ్యూనిస్టులు రావటానికి ఆయన అంగీకరించలేదు. ఇందుకు సంబంధించి శ్రీ రాజాజీ, ప్రకాశంలను బలపరచడం ద్వారా రంగాజీ కాంగ్రెస్‌ను కాపాడారు.

1957 నాగపూర్ కాంగ్రెస్ మహాసభలో గ్రామీణ ప్రాంతాల రైతుల ఆస్తులపై పరిమితులకు సంబంధించి శ్రీ జవహర్‌లాల్ అభిప్రాయాలతో రంగాజీ వ్యతిరేకించారు. "జవహర్‌లాల్‌ను వ్యతిరేకించి, రాజకీయంగా మనుగడ సాగించడం అసాధ్యమని" భావిస్తున్న దినాల్లో రంగాజీ, జవహర్‌లాల్ అడుగులో అడుగు వేయలేక పోయారు. కేవలం గ్రామీణ ప్రాంతాల ఆస్తులపైనే సీలింగ్ పెట్టి, పట్టణ ఆస్తులను మినహాయిస్తే, గ్రామాలకు, పట్టణాలకు మధ్య అంతరం పెరిగి యీ ఆర్థిక అసమానతలు ఏర్పడి ఆర్థిక వ్యవస్థ చిన్నాభిన్నం కాగలదని. ఆస్తులపై పరిమితిని ఇటు గ్రామాలకు, అటు పట్టణాలకు సమాన నిష్పత్తిగా వర్తింపజేయాలని నాగపూర్ కాంగ్రెస్ సభలో రంగాజీ వాదించారు. కాని రంగాజీ వాదనతో శ్రీ జవహర్‌లాల్ ఏకీభవించలేదు. దానితో శ్రీ రంగాజీ 1958 లో కాంగ్రెస్ పార్లమెంటరీ కార్యదర్శి పదవికి, కాంగ్రెస్ ప్రభుత్వానికి రాజీనామా పెట్టి ఒక సంవత్సరంపాటు దేశమంతా పర్యటనలు జరిపి తన ఉద్దేశ్యాలను నాయకులకు, ప్రజలకు వివరించారు. ఈ సంద

ర్వంగా రంగాజీ ఉత్తరప్రదేశ్‌లో శ్రీ చరణ్‌సింగ్‌ను కలసి తన రాజీనామాకు దారితీసిన పరిస్థితులను వివరించి గ్రామీణ రైతాంగము, చేతివృత్తులవారి ప్రయోజనాల పరిరక్షణకు తమతోటి కలసి రావలసినదిగా ఆహ్వానించారు. రంగాజీ సిద్ధాంతాలను శ్రీ చరణ్‌సింగ్ హృదయపూర్వకంగా బలపరచి ఈ విధంగా చెప్పటం జరిగింది. "ఉత్తరప్రదేశ్‌లో నా నాయకత్వం క్రింద ఒక వర్గం కాంగ్రెస్‌లో ఇప్పుడిప్పుడే బలపడుతోంది. నేను నేడు మీతోటి వస్తే ఈ వర్గం విచ్ఛిన్నం అవుతుంది. ముందు మీ కార్యక్రమాన్ని ప్రారంభించండి. ఆ తరువాత నా సహకారం మీకు తప్పక లభించి తీరుతుంది" అని హామీ యివ్వడం జరిగింది. కాని శ్రీ చరణ్‌సింగ్ ఆ తరువాతకూడా ఉత్తరప్రదేశ్‌లోని ముఠా వ్యవహారాలతోనే తన రాజకీయాలను పరిమితం గావించారు.

రాజాజీ ఆచార్య రంగా మరికొందరు మేధావులు కలసి 1959 లో అఖిలభారత స్వతంత్ర పార్టీని స్థాపించారు. గ్రామీణ రైతాంగానికి చేయూతగా పార్టీని తీసుకు వెళ్లాలని రంగాజీ కృషిచేశారు. వివిధపార్టీ మహాసభల్లో రంగాజీ ప్రతిపాదించిన గ్రామీణ ఆర్థిక ప్రణాళికను కొందరు ప్రతిఘటించడంకూడా జరిగింది. కానీ రాజాజీ సూచనమేరకు శ్రీ రంగాజీ కొంతకాలం ఓర్పుతోటి వున్నారు. రాను రాను పార్టీలో పెట్టుబడిదారీవర్గం బలపడటం, 1971 లో గ్రామీణ పేద ప్రజలు శ్రీమతి గాంధీని బలపరచటంతో ఆచార్య రంగాజీ తిరిగి కాంగ్రెసులో పునఃప్రవేశం చేయడం జరిగింది. పట్టణం, గ్రామీణ ప్రాంతాల ఆస్తులపై సమాన నిష్పత్తిలో సీలింగు, వ్యవసాయం, గ్రామీణాభివృద్ధికి ప్రాధాన్యత, ప్రణాళికాబద్ధమైన అభివృద్ధికి సంబంధించి శ్రీమతి గాంధీ నాయకత్వం క్రింద కాంగ్రెస్ ప్రకటించిన కార్యక్రమాలను రంగాజీ సమర్థించారు.

ఆచార్య రంగాజీ రాజకీయవేత్తయే కాకుండా ప్రముఖ సంస్థా వ్యవస్థాపకులు. అఖిలభారత కిసాన్ సమ్మేళన్, అఖిలభారత చేనేత కాంగ్రెస్, ఆక్స్‌ఫర్డులో ఇంటర్‌నేషనల్ లేబర్‌గ్రూప్, రైతు రక్షణ సంఘం, రైతాంగ విద్యాలయం, అఖిలభారత గ్రామీణ ప్రజల సమాఖ్య వంటి పెక్కు ప్రజాహిత సంస్థలను స్థాపించి ప్రజాసమస్యల పరిష్కారానికి కృషిచేశారు. శ్రీ రంగాజీ రాజకీయవేత్త, ఉద్యమ నిర్మాణ, ప్రజాహిత సంస్థల స్థాపకుడే గాక, బహు శాస్త్ర పారంగతులు కూడా. శ్రీ రంగాలో జీర్ణించి ఆయన మస్తిష్కంలో సంచితమైన అపార విజ్ఞానానికి మచ్చుతునక వంటి బాహ్యరూపమే వారి అపూర్వ గ్రంథాలయం. సమకాలీన రాజకీయ, ఆర్థిక, సామాజిక సమస్యలమీద ఆచార్య రంగా లేఖిని అజరామర గ్రంథాలను సృజించింది. అవి విజ్ఞాన ఖండికలుగా విలువను, విశిష్టతను సంతరించుకున్నాయి. ఎకనమిక్స్ ఆఫ్ హ్యాండ్‌లూమ్స్, ఎకనామిక్ కండిషన్స్ ఇన్ ఇండియన్ విలేజస్, రిపోర్ట్స్ ఆఫ్ ది ఎకనామిక్ కండిషన్స్ ఆఫ్ జమీందారి రైట్స్, హిస్టరీ ఆఫ్ కిసాన్ మూమెంట్, క్రెడో ఆఫ్ వరల్డు పెజెంట్రీ, ది పెజెంట్ అండ్ కోపరేటివ్ ఫార్మింగ్, కిసాన్స్ అండ్ కమ్యూనిస్టు వంటి ఆంగ్ల గ్రంథాలను ఏబది వరకు ఆయన లేఖినినుండి వెలువడ్డాయి. ఇంకా సహస్రమైన అమూల్య ప్రసంగాలు, ఇంకెన్నో రిపోర్టు ఇవన్నీ వనరులవలన సాధ్యమయ్యేవి కావు. ఆచార్య రంగాజీ మేధాసంపత్తికి గౌరవంగా 1978 సం॥లో ఆంధ్ర విశ్వవిద్యాలయం "డాక్టరేట్" బిరుదు ఇచ్చినది. ఆంధ్ర యూనివర్సిటీ పాలిటిక్సులోను, పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్‌లో ప్రధాన గౌరవ ప్రొఫెసర్‌గా నియమించి గౌరవించారు. 1980 జనవరిలో లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో ఆచార్య రంగా గుంటూరు లోక్‌సభ స్థానంనుండి లక్ష యాభైవేల వోట్ల అత్యధిక మెజారిటీతో విజయం సాధించారు. 1980 సెప్టెంబరులో శ్రీ రంగా లోక్‌సభలో కాంగ్రెస్ (ఐ) పార్లమెంటరీ పార్టీ డిప్యూటీ లీడర్‌గా ఎన్నికైనారు. అక్టోబరు 11న భారత ప్రతినిధివర్గం నాయకునిగా ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశాలలో పాల్గొనేందుకు న్యూయార్క్ వెళ్ళి రెండు నెలలపాటు అక్కడ వివిధ సభలలో అనేక

కార్యక్రమాలలో పాల్గొని భారతదేశ ప్రతిష్ఠను ఇనుమడింప జేసేందుకు కృషి చేశారు. 1981 నవంబరు 7వ తేదీ హైదరాబాదులో జరిగిన ఘన సన్మానం సందర్భముగా నాటి ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య ప్రతి సంవత్సరం నవంబరు 7వ తేదీన "రైతు దినోత్సవం"గా ప్రభుత్వం వివిధ కార్యక్రమాలు చేపడుతుందని ప్రకటించారు. ఆచార్య రంగా 50 సం॥ల పార్లమెంటరీ సేవాజీవితం పూర్తి చేసుకున్న సందర్భంగా 1982 ఏప్రిల్ 28న న్యూఢిల్లీలో స్పీకర్ శ్రీ బలరాంజాకర్ అధ్యక్షులుగా, శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ రాజీవ్ గాంధీలు ముఖ్య అతిథులుగా, పలువురు ప్రతిపక్ష నాయకుల నేతృత్వంలో ఘనసన్మానం జరిగింది. 1984 డిశంబరులో లోక్‌సభకు జరిగిన ఎన్నికల్లో కోస్తా, రాయలసీమ అన్ని జిల్లాలలో కాంగ్రెస్ ప్రముఖులంతా పరాజయం పొందినప్పటికీ గుంటూరునుండి శ్రీ రంగా కాంగ్రెస్ అభ్యర్థిగా విజయం సాధించారు. లోకసభలో కాంగ్రెస్ (ఐ) డిప్యూటీ లీడర్‌గా నేటికి పార్లమెంటులో నిర్మాణాత్మకమైన కృషి చేస్తున్నారు. 1988 అక్టోబరు 2న హైదరాబాద్‌లో జరిగిన సన్మానసభలో శ్రీ రాజీవ్ రాజకీయ అనుభవం కలిగిన కొంతమందితో ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేసుకోవాలని, ప్రెస్‌బిల్లును ఉపసంహరించుకోవడం మంచిదని" రంగాజీ సలహా యిచ్చారు. తాను నమ్మిన సిద్ధాంతాన్ని నిర్మొగమాటంగా ప్రకటించటానికి ఆయన ఎప్పుడూ వెనుకాడరు.

"వృద్ధమూర్తి" అనే విశేషణం ఆచార్య రంగా వయస్సుకు మాత్రమే వర్తిస్తుంది. మనస్సుకు మాత్రం కాదు. నేటికి సునిశిత బుద్ధితో, విజ్ఞాన సంపదతో, అనర్గళ కంఠంతో, ధవళగిరి శిఖరంవలె ప్రజా సమస్యల పరిష్కారానికి కంకణం ధరించిన యోధుడు ఆచార్య రంగా.



అనేకమంది చంపబడిరి. ఈ ధోరణి నచ్చక రంగాగారు "ప్రపంచ కర్షకులారా! ఏకంకండని" నినాదమిచ్చిరి. ప్రపంచమంతా పర్యటించిరి. అన్నిదేశాలలోని రైతు నాయకులను కలిపి, వారిలో ప్రపంచ రైతు సమాఖ్యను కూడ ఏర్పాటుచేసిరి. రైతుల్లో చైతన్యం వెల్లబికించిరి. స్టాలిన్ కాలంలో రష్యాలో రైతులకు జరిగిన అన్యాయాన్ని గురించి రంగాగారు ఖండించిరి. ఇందువల్ల రంగాగారిని బూర్జువాల ఏజంటని ప్రచారం అటు కాంగ్రెసువారు, ఇటు కమ్యూనిష్టులు చేసిరి. ఈసందర్భములలో వీరిపై వేయని నీలాపనిందలకు కొదవలేదు. తాను సమాజంలో అందరికీ సాంఘిక న్యాయం, రాజకీయ పెత్తనం స్వేచ్ఛకావాలనుకొనే సోషలిస్టుగాబట్టే 1934 లో పాట్నాలో అశోక్ మెహతా, జయప్రకాష్, మసానీలతో కలసి కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించిరి. రైతుస్వామ్యంపై నిండైన విశ్వాసం గల్గియుండబట్టే స్వామీ సహజానంద్, యోగీంద్రశర్మ, ఇందూలాల్ యాగ్నిక్ మొదలయినవారితో కలసి అఖిల భారత కిసాన్ సభను స్థాపించిరి. కోట్లాది ప్రజలు చేతివృత్తుల ద్వారా తమ మనుగడ సాగించుటచే వారి రక్షణకై అఖిలభారత చేనేత కాంగ్రెసును స్థాపించిరి. ఇంగ్లండు నుండి వచ్చీరావటంతోనే తమ స్వగ్రామములో 1926లో ప్రథమ రైతుకూలీ మహాసభను ఏర్పాటుచేసిరి. ఆలనా పాలనా లేని గ్రామీణ జనాలకు అఖిలభారత రూరల్ ఫెడరేషన్ స్థాపించిరి. రాష్ట్ర కాంగ్రెసులో వారు పెత్తనం చేపట్టినపుడు అనేక వర్గసంఘాలను నిర్మించి తద్వారా జాతీయ పోరాటానికి బలము చేకూర్చడమే గాక కాంగ్రెసుకు అఖండ ఖ్యాతిని చేకూర్చిపెట్టిరి. కాంగ్రెసు సందేశాన్ని సామాన్య ప్రజానీకం వద్దకు అందించిరి. తాము ఫెయిజ్‌పూర్ కిసాన్ కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకొన్నప్పుడు ఆ బ్రహ్మాండమైన సభకు శ్రీ జవహర్ పండితుని ఆహ్వానించి, రైతుల క్షేమమే కాంగ్రెసు ధ్యేయమని చెప్పించిరి. రైతు సంఘాలకు ప్రోత్సాహం అందించిరి. జాతిపిత బాపూజీచే తమ రైతు కూలీ ప్రజారాజ్య నినాదమునకు ఆశీర్వాదం సంపాదించిరి. అనేక రైతు సమస్యల్లో పటేల్, రాజాజీలను సైతం తమ ధోరణికి త్రిప్పుకొని వారిచే రైతులకు సహాయ సహకారాలు అందించులా చేయగల్గిరి. ఆనాటి ప్రభుత్వం పార్లమెంటులో రైతు స్వామ్యాన్ని హరింపజేయు చట్టం పాస్ చేయించుటకు సిద్ధమైన సమయంలో తమ పార్టీ వారిచే తానే దానిని వ్యతిరేకింపజేసి రైతులను రక్షింపజేయలేదా? నాడు ఆ చట్టమే పార్లమెంటులో (పాస్) ఆమోదింపబడి రైతులందరూ పుట్టకొకరు-చెట్టుకొకరుగా పడి బ్రతుకవలసి వచ్చేది. ఇది రైతాంగానికి రంగాగారు సంపాదించిన అఖండ విజయం గాదా? ఎల్వాల్‌లో వినోబా భూమిపై దానిని తరతరాల నుండి నమ్ముకొని జీవించే వారికే గాకుండా అందరికీ సమానమైన హక్కు వుండాలంటూ ఎలుగెత్తి చాటినప్పుడు అది తప్పని ఎదిరించినది రంగారు కాదా? రైతులకు పీడకలగా నున్న కంట్రోళ్ళను కేంద్రంలో కిద్వాయిచే, రాష్ట్రములో రాజాజీచే వెంటనే ఎత్తివేయించగల్గింది రంగాగారు గాక మరెవ్వరు? ఈ విషయంలో గాంధీజీని మెప్పించి ఒప్పించినది రంగాగారు గాక మరెవ్వరు? ఆహార వ్యవసాయ శాఖను స్వీకరించుటకు కేంద్ర మంత్రి మండలిలోనికి నెహ్రూగారు ఆహ్వానించగా, గాంధీజీ పటేల్‌గార్లు సైతము తమ ఆమోదముద్రను ప్రకటించగా అందుకు వారు తిరస్కరించిన విషయం తెలియనిది గాదు. రాజాజీ ప్రకాశంగార్లు తమ మంత్రివర్గాలలో చేరమని ఎంత బ్రతిమాలినా తిరస్కరించిన ఘటనలు మరువగలమా? పదవులకు దూరంగా వుండటమే తమ ధర్మమని అనేక సందర్భాలలో ప్రకటించిరి. 1933 నుండి గ్రామాల్లోని రైతు-కూలీ బిడ్డలను తమ రామానీడు విద్యాలయానికి రప్పించి రాజకీయ చదువులు నేర్పి దేశనాయకులుగా ఎందరినో తీర్చిదిద్దిరి. నేడు అటు దేశంలోగాని, యిటు రాష్ట్రాలలోగాని పెత్తనం చేసిన, చేస్తున్న వివిధ రాజకీయ పార్టీలలోనున్న పెద్దలు వీరి శిష్యులే. 1933 నాటి కేంద్ర శాసనసభకు ఎన్నికై రౌండ్ టేబుల్ మీటింగుకు గాంధీజీని ఆహ్వానించాలి అంటూ గంభీరోపన్యాసము చేసి ప్రపంచ నాయకుల దృష్టిని ఆకర్షించిరి. 1934-35 సంవత్సరాల నుండి

వరుసగా ఏబది సంవత్సరాలపైబడి అటు కేంద్ర శాసన సభ్యులుగా నేటి పార్లమెంటు సభ్యునిగా సుదీర్ఘ చరిత్ర గల్గిన వ్యక్తి ప్రపంచంలోనే మరొకరు లేరు.

సోషలిస్టు సమాజ వ్యవస్థలో కూలీలతోబాటు రైతులకు, మేధావులకు కూడ సమాన ప్రాధాన్యము ఉండాలని ఆరాటపడి పోరాడుతున్న రంగాజీ వాదన ఎంత యథార్థమో యిప్పుడు రష్యా సంస్కరణోద్యమము వల్ల విదితమగుచున్నది. రష్య ప్రధాని రైతుబిడ్డ గోర్బచేవ్ ప్రవేశపెట్టుచున్న గ్లాసినోస్త్-పెరిస్త్రోయికాలు దీనికి నిదర్శనలు. స్టాలిన్ హయాములో రైతులకు జరిగిన అన్యాయాలు, అక్రమాలు నిజమేనని యిప్పుడు రష్యా పెత్తందార్లు అంగీకరిస్తున్నారు. ఇంత దూరదృష్టి గల్గి 50 సంవత్సరాలనుండి మన మధ్యలో ఉన్న రంగాజీని మనకంటే యితరులే గుర్తించుట హర్షదాయకము. వీరు ప్రవచించిన రైతు కూలీ ప్రజారాజ్యమే ప్రపంచానికి శరణ్యము. ఇదే ప్రపంచ రైతుకూలీ జనాల అభయము అందువలన రంగాజీకి భారతదేశంలోని రైతాంగము యావత్తు చేయెత్తి జైకొట్టు సమయం ఆసన్నమైనదని చెప్పుట అతిశయోక్తిగాదు.

అధికారానికి అర్రులు చాచక, న్యాయంకోసం, సత్యంకోసం నీతి నిజాయితీలకు ప్రతీకగా నిల్చిన మహా మనిషి రంగాజీ. ఇప్పటికే 88 సంవత్సరాలు నిండి 89వ సంవత్సరములో అడుగిడుచున్న శుభ సమయములో నా శతాధిక వందనములు.



# భారతాంబ బంగారుపంట

—కన్నెగంటి రాఘవయ్య
స్వాతంత్ర్య సమరయోధుడు
రేపల్లె

ఆంధ్ర సౌగంధ్యంబు నంతట నింప
మారుమూలల తిరుగు మలయమారుతము
ఆచార్యరంగాజి ఆంధ్రుల బిడ్డ
భారతాంబ యొడికి బంగారుపంట
మానవతావాది మాననీయుండు
విశ్వశాంతినిగోరు వీతరాగుండు
సకల సంపదలిచ్చు సౌజన్యమూర్తి
ఆడంబరములేని యాదర్శమూర్తి
ఆరుకోట్లాంధ్రుల అపరంజి బొమ్మ
నవ యువకుల దీప్తి నవ్యాంధ్ర కర్త
నిర్మల చరితుండు నిండైన మూర్తి
దీనజనాల యుద్దీప్తి యనంగ
ఆ అవతారమెత్తెను ఆంధ్రుల బ్రోవ
ఆంధ్రుల విఖ్యాతి నవనీతలాన
వ్యాప్తిజేసిన మహా పావనమూర్తి
జ్ఞానాబ్ధినీదిన నవ్యాంధ్ర నేత
పుడమి జనులకు మహా పుణ్యాంపు పంట
కపట మెరుగనట్టి ఘనుడైన రంగ
భూమిని దున్నెను భువిజనుల్ మెచ్చ
ఆంధ్ర కీర్తిపతాక మాచార్యరంగ

రైతురాజ్యము కూర్చ రంగాన నిలిచె
కాంగ్రెసు నాయకాగ్రణియైన రంగ
కాణాచి నిడుబ్రోలు గ్రామమునందు
పందొమ్మిదైనట్టి వందలు జరుగ
ఇల నవంబరు నెల ఏడవ తేది
రంగాజి జన్మించె రైతునేతనంగ
చదువులు శ్రద్ధతో చవులూర చదివి
ఆక్సఫర్డున కేగి యర్థశాస్త్రమును
నేర్పుగా జదివెను నేతలు మెచ్చ
మదరాసు నగరాన మహనీయుడంత
కాలేజి విద్యలు గఱపుచునుండు
ఆర్తుల నాదమ్ము ఆకటిమంట
దీనుల కన్నీరు దిక్కుల బార
భరతాంబ కన్నీరు జడబడ రాల్చ
ఆవేశమొందెను ఆంగ్లేయుగొట్ట
పలువురు మెచ్చంగ పదవినే వదలి
గాంధీకి అండగా గండడై నిలచి
భరతోర్వి సంకెళ్ళు బ్రద్దలుకొట్టి
స్వాతంత్ర్య రంగాన పరుగున దూకె
వాడ వాడల తిరిగి పాటలు పాడి

రైతులందర జేర్చె రంగాన దూక
స్వాతంత్ర్య సంగ్రామ సారథ్యమూని
రైతు నాయకుడన రంగాన దూకె
మహిళ లందర కూర్చ మాన్యు డనంగ
ఆ మహిళామణులెల్ల ఆవేశ మొంది
రాట్నాల పట్టిరి రాజును గొట్ట
ఆ జమీందారుల నణగ ద్రొక్కంగ
రైతు సంఘము పెట్టె రాజునే గొట్ట
రైతు యువకులంత రంగాన చేరి
హాలముల బట్టిరి ఆంగ్లేయుల గొట్ట
చేతివృత్తుల వారు చేతోడు రాగ
చేనేత వారంత చేయూత నీయ
పిడికిలి బిగియించి పెన్తోళ్ళ నెదిరి
వల్లభాయి పటేలు వారసుండ నని
గుజరాతు చేరెను గూండాల గొట్ట
రైతు యాత్రలు గూర్చి రాజును గొట్ట

సేవాదళము గూర్చి చెన్నొంది మించె
రైతు బాంధవుడైన రంగాను పట్ట
అవని గాలించిరి ఆంగ్లేయులంత
జోసుతో ఏకమై భూపతిన్ గొట్ట
దేశమంతటను మహా ధీరులన్ గూర్చి
స్వాతంత్ర్య దీక్షతో సాములు చేయ
రైతులందరు రణరంగాన దూక
హాలముల బట్టిరి ఆంగ్లేయు గొట్ట
పోరాటమే సాగె భూపతిన్ గొట్ట
ఆంగ్లేయు లప్పుడే అరుదెంచి వేగ
రంగాను పట్టిరి రంపాన రాచి
జైలులో పెట్టిరి చంపంగ నెంచి
లాఠీల గొట్టిరి లంఘించి యంత
ఇదిగాంచి ప్రజ లాగ్రహించి రెంతేని
బడబాగ్ని హృదిలోన ప్రజ్వరిల్లంగ
అంతట కల్లోల మావరించంగ
ఆంగ్లేయు పాలనమ్మడుగంటి పోయె



# సిద్ధాంత ప్రవక్త

— కె. వి. సుబ్బయ్య

ప్రపంచమున బుద్ధుడు, యేసుక్రీస్తు, గాంధీ మహాత్ముడు మున్నగు మహాపురుషులు జీవితములో స్వార్థ సుఖాన్వేషణముల కాశింపక దరిద్రనారాయణుల సేవయే పరమార్థమని భావించి దానికై తమ సర్వము నొడ్డి తుదకు తమ ప్రాణములను కూడ ఫణముగనిచ్చి విఖ్యాత యశో విరాజితులైనారు. శ్రీ రంగాజీ కూడ యా కోవకు చెందినవాడని మనము నిస్సందేహముగా చెప్పకొనవచ్చు.

## రంగాజీ బాహుముఖ ప్రజాసేవ :

రంగాజీ లండనులోని ఆక్సుఫర్డు విశ్వ విద్యాలయమున విద్య నభ్యసించు సమయముననే ఇటలీలో నున్న ప్రపంచ కార్మిక సమాఖ్యకు కార్యదర్శియై కార్మిక సమస్యల నర్థము చేసికొన్నాడు. ఇంక తాను స్వతహాగా రైతు కుటుంబమున జన్మించిన వాడగుటచే రైతు కష్టముల నుగ్గుబాలతో గ్రహించిన వ్యక్తి. పిమ్మట గ్రామీణ రైతాంగ జీవితములో చేనేత కార్మికుల ఆర్థిక తదితర వ్యవస్థపై భారతదేశమున సమగ్ర పరిశోధన పర్యటన జరిపి యా విషయముల నాధారముగా పరిశోధనా వ్యాసము సమర్పించి ఆక్స్ఫర్డు D. Lit బిరుదము నందుకొన్నారు.

పిమ్మట స్వదేశమునకు తిరిగివచ్చి 1923 వ సం॥న వ్యవసాయ కూలీ మహాసభను నేటి గోభూమి (రంగాజీ నివాసము) లో జరిపి యానాడు కష్టజీవులై అర్థాకలితో రైతన్నలకు కుడి భుజములుగ నున్న హరిజనుల దీనస్థితిని నివారించుటకై ప్రబోధమునకు పూనుకొని స్వకులస్థులైన కర్రపెత్తనాల సాంఘిక బహిష్కారమునకు గురియై ఊరి వెలుపలనున్న నేటి గోభూమి నివాసమునకు (అప్పుడది పశువుల పాకిడి) అర్థాంగియగు భారతీదేవితో చేరినాడు. అప్పుడే వ్రాసినారు. "హరిజన నాయకుడు" అను హరిజన సేవాసక్తిని వెల్లడించు గ్రంథరాజము పిమ్మట మద్రాసులో పచ్చయ్యప్ప కాలేజీలో ఆచార్యునిగ చేరి విరామ కాలములో దక్షిణాదియంతయు పర్యటించి 1) ది సౌత్ ఇండియన్ అగ్రికల్చరల్ లేబర్ 2) వైల్డ్ ట్రైబ్స్ ఆఫ్ నీలగిరి 3) సౌత్ ఇండియన్ లేబర్ అను మూడు గ్రంథముల రచించి బడుగువర్గాల ఆర్థిక దుఃస్థితిని లోకము దృష్టికి తెచ్చినారు. తరువాత ప్రభుత్వము వారిచే రీసెటిల్మెంట్ కమిటీకి కార్యదర్శిగ నియమింపబడి యా సందర్భననే ప్రభుత్వమునకే వ్యతిరేకముగ రైతన్నలకు జరుగుచున్న యన్యాయమును కమిటీ రిపోర్టులో వెల్లడించి ప్రభుత్వపు ఆగ్రహమునకు గురియై కారాగార శిక్షననుభవించిరి.

అదినుండి వారిజీవితములో యన్యాయము నెదుర్కొనుట, కష్టసహిష్ణుత, త్యాగనిరతి, చోటుచేసికొని వెంకటగిరి, బొబ్బిలి, చల్లపల్లి, జమీందార్లపై పోరాటమునకు పునాదులేర్పడినవి. అదేసమయమున వెంకటగిరి సభలో జమీందారీ కిరాయి మనుష్యులు రాయి విసరగా వారి అర్థాంగి భారతీదేవి నొసట తగిలి రక్తము చిందినది. తదుపరి యా దంపతు లిరువురు గాంధీ మహాత్ముని ప్రభావోత్తేజితులై విలువగల విదేశీ వస్తు వస్త్రములను విసర్జించి సత్యాగ్రహోద్యమమున దూకినారు.

పై విధముగ భారతదేశము సందేశముతో ప్రజలు ప్రజానాయకులు జాతీయోద్యమము నందు చేరినారు. కాని రంగాజీ దూరదృష్టితో యానాడే తెల్లవారల ప్రభుత్వము పోయి నల్లవారల పెత్తనము వచ్చినా రైతుల, కూలీల కష్టములు గట్టెక్కవని భావించి గ్రామీణప్రజల బాగోగులను దృష్టియందుంచుకొని ఆయా వర్గ సంఘముల నేర్పరచి వానిని నడిపించి ప్రజాసేవ యొనర్చు కార్యకర్తలను సేవకులుగా, నాయకులుగా తీర్చిదిద్దుటకై రైతాంగ విద్యాలయము (రాజకీయ పాఠశాలలను) అనేక ప్రాంతముల ననేకసార్లు నిర్వహించి ఎందరినో సేవకులుగా, నాయకులుగా శిక్షణ నొసంగినారు రంగాజీ ఆంధ్రలో యానాడు గల రాజకీయ చైతన్య ప్రసంగికి వారే మూలపురుషు లైనారు. ఆ కృషిలో పైకి వచ్చిన వారే జి.ఎల్. రెడ్డి, తిమ్మారెడ్డి, లచ్చన్న, చెన్నారెడ్డి, రాజగోపాలనాయుడు మున్నగువారు. ఆనాటి రాజకీయ పాఠశాలలనుండి వచ్చిన ప్రముఖులెందరో వివిధ పార్టీలలో సారథులైనారు. మిగిలిన ప్రజానాయకులు కూడ రంగాజీ ధోరణిలో యాలోచించి వ్యవహరించినచో నోరులేని యీ గ్రామీణ జనాలకై యింతటి నిర్వేదము చెందవలసిన యవసర ముండెడిది కాదు గదా.

రంగాజీ నీతి నిజాయితీలు గల ప్రజానాయకుడు. పదవులకు పిలుపు వచ్చినా యాశించక గాంధీజీ ధోరణిలో నాటినుండి నేటివరకు ప్రజాసేవ యొనర్చుచు తన సతీమణిని కూడ నదే మార్గమున నడిపించుకొని (ఆమెచే తాను కూడ నడిపింపబడుచు) చరితార్థుడైనాడు. ప్రతిపక్షీయులైనను రంగాజీపై యవినీతి యారోపణలు చెయ్యలేదు, చేయజాలరు కూడ.

ఈ విధముగ కర్మయోగ పరుడైన పవిత్రమూర్తి సిద్ధాంత మేమో యొకసారి చెప్పుకొందము. ప్రపంచమున నెచ్చట కూడ ఒకేవర్గ ప్రభుత్వ మేర్పడి మిగిలిన వారిని అణచివేయకుండ అశేష శ్రామిక జనులు తదితరులు తమ శ్రమకు తగిన ఫలితము నందుకొనుచు సంఘమునకు హాని లేకుండ వ్యక్తిగత వికాసమును పెంపొందించుకొనుచు, తద్ద్వారా సామ్యవాద సమాజమును మహాత్ముని ధోరణిలో నేర్పరచుకొనుట దీని ముఖ్యాంశము. దీనితో కమ్యూనిస్టుల శ్రామిక నియంతృత్వ ముండదు. రైతులు, కూలీలు, ప్రజలు (బుద్ధిజీవులు) అయిన వారు తమ శ్రేయస్సుకై సంఘము లేర్పరచుకొని సహయోగ్యతో తమయొక్క దేశము యొక్క యభివృద్ధికై కృషి యొనర్చుటయే దీని పరమార్థము. దీనినే రంగాజీ రైతుకూలీ ప్రజా రాజ్యమును వినాదముగ జనాలకు ప్రబోధించి గాంధీ మహాత్మునిచే కూడ భారతీయుల గమ్యమీ సద్ధాంతాచరణమని యంగీకరింప చేసినాడు.

ఇట్టి సిద్ధాంత ప్రవక్తపై పార్టీలు మారి క్రొత్త పార్టీల నేర్పరచి స్థిరత్వము లేనివాడని తెలిసినవారు, తెలియనివారు కూడ నీలాపనిందలు వేయక పోలేదు. దానికి కారణము రంగాజీ యిష్టములవలె కాంగ్రెసులోనే యుండి యుత్తాలు కట్టెడి స్వభావము లేనివాడు గదా. అట్లని పెత్తనదార్లకు దాసోహమని తాను నమ్మిన సిద్ధాంతమును విడనాడు పిరికివాడును కాతపోవుటనియు చెప్పవచ్చును. నిజముగా తన సిద్ధాంతమును విడువక యుద్యమించని యెత మెదపక పోయినచో యీనాడు భారతదేశమున నున్న రైతాంగ వ్యవస్థ (స్వంత కమతముల పద్ధతి) మూలమట్టముగ తుడుచుకొని పోయి రైతాంగ సంతతయు ప్రభుత్వపు దాసిన కూలీలుగా మారవలసి వచ్చెడిది. అటులనే కాంగ్రెసులో నున్న కర్రపెత్తనదార్లు చేసెడి ప్రజా వ్యతిరేక కార్యక్రమముల నడ్డగించుటకై వేరొండు పార్టీల నిర్మించి ప్రజా రక్షణలో కృతకృత్యు డైనాడు. కార్మిక నియంతృత్వమున కడ్డుతగిలినాడని కమ్యూనిస్టులు, కర్ర పెత్తనదారీతనము పనికి రాదన్నందులకు కాంగ్రెసువారు రంగాజీపై సాగించిన దండయాత్రలను వారు తన నీతి నిజాయితీలతో నెదురొడ్డి నిలువగలిగినాడు.

సామూహిక ప్రభుత్వ వ్యవసాయ విధానము నెదిర్చి రైతాంగపు యునికిని నిలబెట్టిన ధీరుడు. అదే విధముగ వ్యవసాయ కూలీలకు కనీస వేతన నిర్ణయము

ద్వారా రక్షణ కల్పించ గలిగినాడు. ఒకప్పుడు రైతులను కులక్ లని మార్చు పరిభాషలో విప్లవ వ్యతిరేకులుగా ప్రచార మొనర్చిన కమ్యూనిస్టులీనాడు చిన్నచిన్న కమతము (ప్రయివేటుగ) లున్నగాని యుత్పత్తి పెంపొందదనియు, రైతాంగ వ్యవస్థ విప్లవధోరణి కలదనియు వారి శ్రేయస్సే దేశాభివృద్ధికి దోహదకారి యనియు యంగీకరించి రంగాజీ సిద్ధాంత పంథాను చేయుచున్నారు.

రంగాజీ గాంధేయమైన ప్రజాస్వామ్య ధోరణిలో దేశమున కుపకరించు సలహాలు, వాదనలు గల ప్రతిపక్షీయుల మాటలకు, చేతలకు విలువనిచ్చి గౌరవించే సిసలైన ప్రజాస్వామ్య విశ్వాసపరుడైన నాయకుడు. స్వపక్షము వారినైనను తప్పుల నొనర్చకుండ ప్రజాస్వామ్య పరిరక్షణయే గాంధీ మహాత్ముని యనుచరునిగా వారసునిగా రంగాజీ ధ్యేయమై యున్నది.

రంగాజీ రైతు కూలీ ప్రజారాజ్య సిద్ధాంతము ప్రపంచ రైతు మహాసభలలో విదేశీయు లందరిచేతను వేనోళ్ళ ప్రశంసింపబడి ప్రపంచ రైతు నాయకాగ్రేసరుడుగా వారికి గుర్తింపు కల్గించినది. భారతీయ సంప్రదాయములో గాంధీజీ తరువాత దేశమున ఆదర్శ దంపతులు రంగాజీ, భారతీదేవి గార్లనుట యతిశయోక్తి కానేరదు. ఇట్టి నీతి నిజాయితీలు, సిద్ధాంతమును యాచరించగల సామర్ధ్యమున్న వ్యక్తిగా గుర్తించియే శ్రీమతి ఇందిరాగాంధి, ప్రస్తుతము రాజీవ్‌గాంధీ లిరువురు కూడా రంగాజీయొక్క నిస్వార్ధ సలహాలకు తమ పరిపాలనలో విలువ నిచ్చుట నగ్నసత్యము.

ఈ మహత్తర ప్రజాస్వామ్య సిద్ధాంతకర్తను ప్రజాస్వామ్య వాదులందరు అభిమానించి అనుసరించుట ధర్మము. రంగాజీ యీనాడు జీవితమున 89 సం॥లో ప్రవేశించుచు, ఆరోగ్యముగా, నుత్సాహముగా నున్నారంటే అది వారి నియమబద్ధ జీవితమునకు, సచ్ఛీలతకు ముఖ్యముగా భారతీదేవిగారు "కార్యేషు దాసీ" యను పద్యమునందు వలె చూపిన యాదరణమే. ఇట్టి ప్రజానాయకుడైన రంగాజీ కనీస మింకొక పుష్కరకాలము (12 సం॥లు) ఆయు రారోగ్యములతో వర్ధిల్లి ప్రజానీకమును సేవించు భాగ్యము భగవానుడు కల్పించు గాక.

రంగాజీ జిందాబాద్

రైతుకూలీ ప్రజారాజ్యము వర్ధిల్లాలి.



# పవిత్ర రంగాజీపైనే మొగ్గింది

— శ్రీ కె. రోశయ్య (మాజీ మంత్రి)

90 ఏళ్ళ జీవితంలో ఏమి సాధించారు అని ఆలోచించి, సింహావలోకనం చేసి చూస్తే మన ఆచార్య రంగాను గురించి గర్వించదగినవి చాలా ఉన్నవి. ముఖ్యంగా రైతులోకం ఈ దేశంలో ఆయన భావాలనూ, చేసిన సేవలనూ 21వ శతాబ్దంలోకి కూడా తీసుకెళతారనటంలో సందేహం లేదు. జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులలో రైతుల, కూలీల సమస్యలను అధ్యయనం చేసి ఆక్స్‌ఫర్డ్ వరకూ తీసుకెళ్ళి ఆలోచనను ప్రతిఫలింప చేసిన రంగాజీ అసమానులు.

1930 ప్రాంతాలలో ప్రత్యేకించి రైతుల సమస్యలను వామపక్షాలతో సహా అందరికీ నచ్చచెప్పటము అనన్య సామాన్య విషయం. ఇందూలాల్ యాగ్నిక్ వంటి వారితో కలసి అఖిలభారత స్థాయిలో కిసాన్ సమస్యలను ఆందోళనాపూరితంగా అందరి దృష్టికి తీసుకొచ్చిన ఖ్యాతి రంగాజీదే. గ్రామీణ జనాల ఆర్థిక స్థితిని ఆకళింపు చేసుకున్న రంగాజీ రైతులు, కూలీలు, ఇతర చేతివృత్తుల వారికోసం "కిసాన్-మజ్దూర్ ప్రజారాజ్యం" సిద్ధాంతాన్ని లేవదీశారు. దేశవ్యాపితంగా పర్యటించి గ్రామీణ ప్రజలను ఉద్యమోన్ముఖులుగా తీర్చిదిద్దేందుకు ఎంతగానో శ్రమించారు.

ఒకవైపున రాజకీయాలలో ముఠాలూ, కలహాలూ. పార్టీల సగపట్లు స్వాతంత్ర్యానికి పూర్వమూ, తరువాత కూడా సాగిపోతున్నా రైతుల సమస్యలను మాత్రం రంగాజీ విడనాడలేదు. అందుకే కాబోలు రంగాజీ వున్నంతకాలం రైతులకు తిరుగులేదని పార్లమెంటులోనూ, బయటకూడా అభిప్రాయాలు వ్యక్తమయ్యాయి.

"స్వయంపోషక వృత్తుల" వారికి రక్షణ కావాలన్న సిద్ధాంతాన్ని ప్రబోధించి ప్రైవేటు, పబ్లిక్ రంగాలతో పాటు స్వయంపోషక వృత్తులవారికి కూడ ఆర్థికరంగంలో హెచ్చు ప్రాధాన్యత వుండాలని పట్టుబట్టి ఈ విషయంలో గాంధీజీ ఆశీస్సులు పొందారు. ఈ గ్రామీణ జనాల అభ్యున్నతికి రంగాజీ చేసింది కృషి కాదు! తపస్సు! 60 సంవత్సరాల క్రితం ఆయన పెట్టిన బిక్ష, దానంవల్లనే, తాను రాజకీయంగా ఎదురుదెబ్బలు తినవలసి వచ్చినప్పటికి తాను నమ్మిన "రైతు కూలీ" క్షేమ సిద్ధాంతాన్ని విస్మరించ లేదు. కాంగ్రెస్ రైతుకూలీ ప్రజారాజ్య సంస్థగా పరివర్తింప చేసేందుకు, ఎలాంటి రాజకీయ ప్రలోభాలకు లొంగక, "మంత్రి పదవులు, గవర్నర్‌గిరీలు" నా లక్ష్యాన్ని వమ్ముచేయ జాలవని స్పష్టం చేసిన వజ్ర సంకల్పుడు ఆచార్య రంగాజీ.

ఆంధ్రరాష్ట్రంలో వామపక్షాల వారికంటె ముందే రైతాంగ విద్యాలయాన్ని స్థాపించి కుల, మత ప్రాంతీయ తత్వాలకు అతీతంగా ఎందరో కార్యకర్తలను ఆకర్షించి శిక్షణ ఇవ్వటంలో అగ్రతాంబూలం కూడా రంగాజీకే దక్కింది. గాంధీజీ, సుభాస్‌చంద్రబోస్‌లు సందర్శించి, ఆశీర్వదించిన రైతాంగ విద్యాలయం

భవనాలకూ, భారీ పరికరాలకూ ప్రాధాన్యత ఇవ్వకుండా శిక్షణా శిబిరాలకూ, మెరికల వంటి కార్యకర్తలను తయారు చేయటానికే ప్రముఖ స్థానాన్ని ఇచ్చింది. రాష్ట్ర వ్యాప్తంగా జరిగిన ఈ శిక్షణా శిబిరాలనుండి నేర్చి బయట పడినవారు ఉత్తరోత్తరా నాయకులుగా, మంత్రులుగా, భిన్న రంగాలలో నిష్ణాతులుగా దశదిశలా వ్యాపించారు. వారి పేర్లన్నీ వ్రాసుకుంటూ పోతే ఒక చిన్న గ్రంథమే అవుతుంది. వారంతా తరువాత వివిధ పార్టీలలో భిన్న రంగాలలో పనిచేస్తూ పోయినప్పటికీ రంగాజీ గురుత్వాన్ని మాత్రం విస్మరించ లేదు.

విదేశాలలో చదివి వచ్చి ఆ రోజుల్లో రైతుల మధ్య కలిసి మెలిసి తిరుగుతూ, వారి సమస్యలను అందరి దృష్టికి తీసుకెళుతూ, రైతు ప్రాధాన్యతను చాటిచెప్పటం ఎవరికైతే! రంగాజీ పట్టుదలతో ఆ కృషిని కొనసాగించారు. అవసరమైతే రైతులకోసం ప్రభుత్వాలనూ, పెద్ద నాయకులనూ ఎదుర్కొన్నారు. జీవితమంతా పదవిలో లేకుండా, కేవలం రాజకీయ వేదికల ప్రసార సాధనాలతో ఇటువంటి కృషి సాగించటం ఒక పట్టాన సాధ్యమయ్యే పని కాదు. 1930 నుండీ నేటివరకూ లోక్‌సభలోనూ, రాజ్యసభలోనూ ఆచార్య రంగాజీ వాణి వినబడుతూనే వున్నది.

విప్లవ రైతాంగం అనే పుస్తకంలో చరిత్రలో రైతులు నిర్వహించిన విప్లవ పాత్రను ఘట్టాలవారీగా ప్రస్తావించి అంతవరకూ రైతులు ఇసుక వంటివారని వచ్చిన మచ్చను పోగొట్టారు. తన రచనల్లో రాజకీయజ్ఞత కంటే రైతాంగ సమస్యల పరిష్కారానికే ప్రాధాన్యత ఇచ్చారు. గ్రామీణ రంగంలోని సమస్యల్ని మథించి ఆకళింపు చేసుకున్న రంగాజీ ఆ గ్రామీణ సంబంధాన్ని అన్వయించటంలో, సమన్వయించటంలో ఆయన రచనలకు మరొకరు సాటి రారనటంలో అతిశయోక్తి లేదు, విదేశాలలో ఫెరెంక్‌నాగీ వంటి వారి సహచర్యంతో ఈ రైతు వాణిని ఐక్యరాజ్యసమితి వరకూ తీసుకెళ్ళారు. ప్రపంచంలో పేర్కొనదగిన దేశాలన్నీ పర్యటించిన రంగాజీ ప్రతిచోట తన ప్రధాన ముద్రను వేసివచ్చారు. "ఫైట్ ఫర్ ఫ్రీడం" అనే పుస్తకంలో రైతుగా తన రాజకీయ పోరాటాలను వివరించారు. సాహిత్య, చారిత్రిక రంగంలో కృషిచేసిన రంగాజీ కాకతీయులు మొదలు కవిరాజు వరకు అధ్యయనం చేసి తన భావాలను మన కందించారు. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ పుంఖాను పుంఖంగా రచనలు చేసి తన స్థానాన్ని చిరస్థాయి చేసుకున్నారు. ఎక్కడున్నా అన్ని పార్టీల గౌరవ మన్ననలు పొందుతూ రైతు అభిమానిగా, సిద్ధాంతకర్తగా పేరు తెచ్చుకున్నారు. ఇన్ని జరిగినా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని, జైలుకుపోయి శిక్ష ననుభవించి స్వేచ్ఛ లభిస్తేగాని రైతుల సమస్యలు పరిష్కారము కావన్నారు. పత్రికలు పెట్టి, ఇతరులను ప్రోత్సహించి; వ్రాయించి, తాను వ్రాసి సమస్యలను పాలకుల దృష్టికి తెచ్చారు. ప్రజలను చైతన్యవంతులను చేశారు. ప్రపంచ అనుభవాలను మన రైతుల కనుకూలంగా మలచటం ఎట్లా అన్న తపన ఆయన నిరంతర కృషిలో భాగంగా కనిపిస్తుంది.

ఒక్క విషయం మాత్రం స్పష్టంగా పేర్కొనక తప్పదు. రైతులు ఎక్కడవున్నా స్వేచ్ఛాజీవులనీ, నిర్బంధాన్ని ప్రతిఘటిస్తారనీ ఆయన ముందే గ్రహించారు. క్రమశిక్షణ పేరిట సైన్యంలో వలె రైతుల్నిగూడా మళ్ళించి మూకుమ్మడిగా పనిచేయించి నిర్బంధ వ్యవసాయ క్షేత్రాలద్వారా ఉత్పత్తి పెంచాలనే సిద్ధాంతాలనూ

ఆచరణలో రంగాజీ వ్యతిరేకించారు. ఈ విషయంలో మాత్రం ఆయన ఏ పార్టీతోనూ, ఏ నాయకుడితోనూ రాజీ పడలేదు. ప్రస్తుతం ఆయన చెప్పిందే సరైనదని కమ్యూనిస్టు దేశాలు సహితం రుజువు చేస్తున్నాయి. స్టాలిన్ ప్రవేశపెట్టిన నిర్బంధ సమిష్టి వ్యవసాయ విధానాన్ని నేడు రష్యా అధ్యక్షుడు బాహాటంగా వ్యతిరేకిస్తున్నారు. ఒకనాడు మన కమ్యూనిస్టులు రంగాజీని ఇలాంటి అభిప్రాయాలకు దుయ్యబట్టారు. చరిత్ర రంగాజీవైపే మొగ్గింది. సమకాలీన సంఘటనలు రంగాజీ సిద్ధాంతాలకు నివాళులు అర్పిస్తున్నాయి. అంతకంటే గర్వించదగిన దృష్టి, ఆనందం ఏముంటుంది?

రూరల్ యూనివర్సిటీ భావన చిరకాలంగా రంగాజీ ప్రచారం చేస్తూ వచ్చారు. అది రూపురేఖలు దిద్దుకొని ఆయన భావాల కనుగుణంగా సాగిపోతుందని ఆశిద్దాం.

త్యాగానికి ప్రతిరూపంగా వెలుగొందుతున్న పూజ్య శ్రీ రంగాజీకి "భారత రత్న" గౌరవం ఒక్కటే దక్కాలి. ఈ కోరిక త్వరలో తీరుతుందని ఆశిస్తున్నాను.

జై హింద్



# నాకు తెలిసిన మేటి దంపతులు

— గల్లా అరుణ, చిత్తూరు.

1954లో ఆచార్య రంగాగారు తిరుత్తణిలో రైతాంగ కార్యాలయం నడిపారు. మా నాన్నగారు నన్ను తీసుకు వెళ్ళినారు. అప్పుడు నాకు ఏడు సంవత్సరాలు వయస్సు. ఆ చిన్న వయసులోనే వారి చెప్పల్లు నన్ను ఎంతో ఆకర్షించాయి. తీరిక సమయాలలో నన్ను దగ్గరుంచుకొని రైతుల గురించి, గ్రామీణ జీవనాన్ని గురించి, స్త్రీ స్వాతంత్ర్యం గురించి ఎన్నో చెప్పేవారు.

నేను కొంత పెద్దయ్యాక నన్ను దగ్గర కూర్చోపెట్టుకొని, స్త్రీలగురించి-స్త్రీ స్వాతంత్ర్యం అంటే కొంతమంది తప్పు ధోరణిలో అనుకొంటారమ్మా. స్వాతంత్ర్యం అంటే భర్తను ఎదిరించి, ఇంట్లోవాళ్ళని ఎదిరించి పనులు చేయకుండా కూర్చోవటం అని అనుకొంటారు కొంతమంది. స్వాతంత్ర్యం అంటే అలా కాదు. కష్టపడి పని చేయాలి. మన ఆచార, వ్యవహార, కట్టుబాట్లకు భంగం కలగని విధంగా నడుచుకోవాలి. మగవాళ్ళు ఆడవాళ్ళ ముందు చాలా అసమర్థులమ్మా. ఒక ఆడపిల్ల ఎంతమంది మగవాళ్ళను చైతన్యవంతుల్ని చేస్తుంది. ఇటు భర్తను, అటు బిడ్డలను, మరోవైపు కుటుంబముపై ఆధారపడిన చుట్టుప్రక్కల వాళ్ళను అందరిని ఒక ధోరణిలో పెట్టి నడుపగలిగేదీ ఆడబిడ్డే.

చాలమంది మనదేశంలో స్త్రీకి స్వాతంత్ర్యం లేదనుకొంటారు పిచ్చివాళ్ళు. మనదేశంలో స్త్రీలకు స్వాతంత్ర్యం లేకపోవడ మేమిటమ్మా! ఆడబిడ్డ అంటే ఎవరు? పుట్టుకతోనే లీడరు. ఎందుకని? తనకంటే పదేళ్ళు చిన్న వయస్సున్న అమ్మాయిని అబ్బాయికి చేస్తే ఇల్లంతా చక్కదిద్ది, ఇంటిని తన ఆధీనంలోకి తీసుకొని ఇంటిలో వాళ్ళకు, ఇంటికి సంబంధించిన వారికి ఎంతో రక్షణ కల్పిస్తుంది. తమ దగ్గర పనిపాటలు చేసుకొనే వారిని క్రమశిక్షణలో పెట్టి ఎప్పుడు ఏది చేయాలో శాసిస్తుంది. ఈరోజు కళ్ళముందు పుట్టిపెరిగిన బిడ్డ రేపటికి చూస్తే ఇట్టే ఎదిగిపోయి ఎన్నో రకాలుగా పెద్ద అనిపించుకొంటుంది. ఎంత తమాషాగా వుంటుంది అని నవ్వేవారు.

అలాగే వారు భారతమ్మకు ఎంతో స్వాతంత్ర్యం ఇచ్చారు. ఆడవారిలో ఎన్నుకోదగిన మణిదీపిక భారతమ్మగారు, రాజకీయంగా ఆమెను ఎంతో ఎంకరేజ్ చేశారు. అటు కుటుంబ బాధ్యతలు నెరవేర్చుకొంటూ రంగాగారి రాజకీయ జీవితంలో చేదోడువాదోడుగా వుంటూ ఆమెకూడా రాజకీయరంగంలో చురుకుగా పాల్గొంటూ వారి అడుగుజాడలలో నడచేవారు.

నాకు ఊహ వచ్చిన దగ్గరనుండి రంగా గారిని దగ్గరగా చూస్తూవుండే వారికి దేశం, రైతులు, రాజకీయాలు తప్ప వేరే ఆలోచనలే వుండేవి కావు. ఏనాడూ వారు కుటుంబం అనిగానీ, ఇల్లు అని గానీ చూసుకోలేదు. "నాది" అని దేన్నీ అనుకోవడం నేను చూడలేదు.

ఎన్నిపనులు వుండినప్పటికీ శాంతీదేవిగారు ఇంటికి వచ్చినవారిని తల్లిలాగ ఆదరించి దగ్గర ఉండి అన్నంపెట్టి అన్ని సౌకర్యాలు స్వయంగా చూసుకొనేవారు.

ఒకరోజు ఇంటికెవరో వస్తుంటే చీరతెప్పించి పెట్టారు వారికి పెట్టడానికి. శాంతిదేవిగారు ఎప్పుడూ ఖద్దరు చీరలే పెట్టేవారు. ఆ చీర మాని యీ చీర తెప్పించారు అనడిగారు ఎవరోవస్తున్నారు వారికి పెట్టడానికని చెప్పారు. రంగాగారు వెంటనే నవ్వి ఎందుకమ్మా మీకు అంత ఈ పిచ్చితనం? ఆ చీర ఖరీదు మాకు పార్టీఫండుకు యిస్తే మేము దేనికో ఒకదానికి ఖర్చుపెట్టుకోమా? అన్నారు. అందుకు అమ్మగూడ నవ్వుతూ చూడమ్మా మీ తాతగారు' వారి ధోరణేగానీ యిక రెండో లోకమే చూడరు అన్నారు నాతో. ఇలాగే ఎప్పుడూ వారు ఒకరివగ్గర కూర్చొని కుటుంబవిషయాలు మాటలాడుకోవడం నేను వినలేదు. ఎప్పుడయినా అమ్మ కుటుంబ ఆదాయ-వ్యయాల గురించి మాటలాడబోతే వీరు నవ్వుతూ ఆ విషయాలన్నీ నాకెందుకమ్మా' పార్టీ విషయాలేవయినా వుంటే చెప్పండి అనేవారు. వీటికి ఎన్నడూ ఆమె బాధపడేవారుకాదు. నాతో నవ్వుతూ మీ తాతయ్యగారు చిన్నపిల్లలతో సమాన మమ్మా. వారికి ఎప్పుడూ రైతులు, రైతు ఉద్యమాలు తప్పించి ఇంకేమి పట్టవు అనేవారు.

నిజంగా తాత అంటే. దేశం, ఉద్యమాలు, దేశ అభివృద్ధి ఇలాంటివితప్ప ఇంక రెండో సబ్జక్టు గురించి వారు మాటలాడేవారుకారు. ఆలోచించేవారుకాదు.

నాన్నగారు చెప్పేవారు మీ తాతగారు అసమానులు. దీక్షకంకణబద్ధులు, రైతుల్ని గురించి ఎవరూ ఆలోచించని రోజుల్లోనే వారు రైతాంగాన్ని మేల్కొలిపి ఉద్యమాలు సాగించి అందరికీ ఆదర్శప్రాయులైనారు. ఏనాటికైనా రైతులు జయిస్తారని గట్టి విశ్వాసంతో వుండేవారు. అంటూ తాతగారు గురించి ఎన్నో గొప్ప విషయాలు చెప్పేవారు.

ఎన్ని ఉద్యమాలు నడిపించినప్పటికి. ఎంతదీక్షతో పనిచేసినప్పటికీ నేను ఎప్పడయినా వారితో వుండటం తటస్థిస్తే ఎంతో వేరుగా కనిపించేవారు నాకు. నాకెప్పుడూ మా తాతగారితో మాటలాడటం, వారు చెప్పినవి వినడం చాలాయిష్టం. మాటలాడుతూ మాటలాడుతూ అలా నడుద్దాం వస్తావా! అని అడిగేవారు. సరే వెంట బయలుదేరేదాన్ని. ఉన్నట్టుండి ఒహో. హో! అనేవారు. ఏంటి తాతయ్యా! అని అడిగితే ఓరి అలా చూడవమ్మా ఆ చెట్టునుండి ఆకులు అలా జాలర్లలాగ జారుతూవుంటే అలా షవరు జల్లు చల్లినట్టు ఎంత అందంగా వుందో! ఇటు చూడమ్మా! యీ బుల్లిచెట్టుకు పచ్చని పువ్వులిచ్చి దేవుడు ఎంతబాగా సృష్టి చేసాడో! ఇదంతా లోకంలో వుండే అందం. యీ అందాన్ని తనివిదీరా చూచి ఆనందించాలి. అంటూ ఎంతో నిర్మలంగా నవ్వుతూ సంతోష పడుతుండే ఆ మొహంలో నిజంగా పసిపిల్లల నిర్మలత్వం కనిపించేది. ఏ అందాన్నయినా అభినందించడం లోకంలో సొగసుల్ని చూచే ఆనందించడం, రైతు కూలీల అభివృద్ధికి పాటుపడటం వారి నైజం వారితో గడిపిన ప్రతి నిముషం చాలా విలువైనది. వారితో వుంటే ఒక మహా జ్ఞానోదయ పాఠశాలలో వున్నట్టు ఉంటుంది. ఇంతటి అపూర్వ వ్యక్తిని కలిగిన మనదేశం, మనం అదృష్టవంతులం. ఇలాంటి మహనీయతను సాక్షాత్కరించ గలగడం, వారితో వున్నటువంటి సంబంధం ఒక అపూర్వమయిన వరం. ముందు తరాలవారి భవిష్యత్తును తీర్చిదిద్దటానికి వీరికి ఇంకా ఆయుష్షు పెంచాలని దేవుని మనసారా కోరుకుంటున్నాను.

# సిద్ధాంతకర్త రంగాజీ -
# అంతర్జాతీయ అవగాహన - పెరిస్త్రోయికా

— శ్రీ గోరికపోలు పాండురంగారావు

అనాదినుండి చరిత్రను పరిశీలిస్తే మనకు ఒక యదార్ధం గోచరిస్తుంది. మహామహులందరూ తమ తమ జీవితాల నెదుర్కొన్న విషమ సమస్యల పరిష్కారంలో వారికి ఏదో ఒక అజ్ఞాత శక్తి వెలుగుబాట చూపించి నట్లు కనిపిస్తుంది. ఋషితుల్యుడు రంగాజీకి కూడా తన భావాలకు పటిమనూ, ఉద్యమాలకు ఊపిరీ, సమస్యలకు పరిష్కారం ఏదో ఒక అగోచర శక్తి వెన్నంటి అందిస్తూ వస్తూనే ఉంది. కాకతీయ నాయకులు శౌర్యం శాస్త్రం ద్వారా తమ ప్రజలను కాపాడితే, రంగాజీ తన సిద్ధాంత బలంద్వారా గ్రామీణ జనాలను కాపాడటానికి నిరంతర పోరాటం సాగిస్తూనే ఉన్నారు.

రంగాజీ జీవిత ప్రథమాధ్యాయంలోకి వెళ్లి చూస్తే బాల్యంనుండీ స్వతంత్ర వృత్తిదారైన రైతులు, కళా కారులు, బుద్ధజీవుల, ఆర్థిక, సాంఘిక అభ్యున్నతే పరమావధిగానుండే వాతావరణంలో పెరిగారు 1917, 1919 సంవత్సరాల్లో రష్యన్ విప్లవం రంగాజీ అభ్యు దయ భావాలను ప్రభావితం చేసింది. రష్యాలో తర తరాల బానిసత్వంలో మ్రగ్గుతూ, కాల్లగొట్టబడుతున్న గ్రామీణ కిసానులు, కళాకారులు స్వాతంత్ర్యం పొంది నట్లుగానే, భారతదేశంలోని గ్రామీణ, శ్రామిక జనాలు, కృషీవలులు విముక్తి పొందాలని కోరుకున్నారు.

రాలి జీవితంలో వివేకానంద, వీరేశలింగం పంతులు, గాంధీజీ, త్రిపురనేని రామస్వామి మొదలగు వార్ల ప్రభావం రంగాజీ నైతిక విలువలకు, సంస్కార బాభిలాషకు, సామాజిక, రాజకీయ చైతన్యానికి పదును పెట్టాయి. తదనంతరం రంగాజీ నుండి ఉద్భవించిన స్వయంవృత్తుల సిద్ధాంతానికి (Self Employed Sector) దోహదం చేశాయి. స్ఫూర్తి నిచ్చాయి. భారతదేశ అభ్యున్నతికి, ఆర్థిక సంపదకు కృషీవలులు, చేనేత పారిశ్రామికుల పాత్ర అత్యంత అవశ్యకమని విశ్వసించారు. తాను యూరప్‌లో పర్యటించినప్పుడు కూడా అక్కడ ప్రగతిశీల రైతులు వ్యవసాయ సహ కార సంఘాలద్వారా, తమ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల పరిధిని విస్తృతపరచుకుంటూ తమ వృత్తులను కొన సాగిస్తున్నట్లు గమనించారు. ఆ సన్నివేశమే భారత గ్రామీణ జనాలకు కల్పించి, వారికి భద్రత కలుగజేయు డానికి తనలో సంకల్పం కలుగజేసింది. తనలో తప నను, పట్టుదలను పెంచినట్లు కనిపిస్తుంది. ఆప్పటిద్దు విద్యాభ్యాసం రోజుల్లో అభ్యుదయ కమ్యూనిస్టు, సోష లిస్టు భావాలు రంగాజీని కుదిపివేశాయి. ఐతే తనలో పెనవేసికొని వున్న స్వయం వృత్తుల సిద్ధాంత దృక్పథంతో ఆర్థిక స్వాతంత్ర్యంపై పరిశోధన సాగిం చారు. స్వేచ్ఛా ప్రవృత్తి ద్వారామాత్రమే ఉత్పత్తి ఇనుమిక్కిలిగా పెంచవచ్చనే నిర్ణయానికి వచ్చారు. ఎక్కువకాలం యూరోపియన్ కమ్యూనిస్టు, సోషలిస్టు నాయకులతో కలిసిమెలసి ఉన్నా కమ్యూనిజంతోగాని, మార్క్సిజంతోగాని పూర్తిగా ఏకీభవించలేదు.

[illegible] సలహాపై డెన్మార్క్, ఇటలీ, ఫ్రాన్స్, జర్మనీ ల పర్యటించి వ్యవసాయ సహకార సంఘాలను ంచి, ఉత్సాహం, ఉద్వేగం సంతరించుకొన్నారు. ంటి సహకార సంఘాలు సంఘానికి కావలసిన సముదాయాన్ని, మార్కెటింగ్ సౌకర్యాలను ంచగలవని, ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేయగల కొన్నారు. సేవా సహకార సంఘాల నిర్మాణాత్మక ను పరిశీలించిన తర్వాత జి.డి.హెచ్. కోల్‌గారి సోషలిస్టు విధానం, గ్రామీణ రైతుం, చేనేత ులవారి జీవన ఆర్థిక విధానానికి సన్నిహితంగా ని గమనించారు. యూరోపియన్ ఆర్థిక శాస్త్ర లు, కమ్యూనిస్టులు చెబుతున్నట్లు-చేనేత పరిశ్రమ జౌళి పరిశ్రమ అభివృద్ధి చెందాలనే విషయంతో ఏకీభవించలేకపోయారు. ఈ సందర్భాన్ని కరించుకొని నూలు మిల్లులలో ప్రాయబడిన పనివారల పోరాటాల చరిత్ర అన్నీ అధ్యయనం . వీటికితోడుగా రాయలసీమ కరువులో ఉపాధి సమాచారం, ఇంగ్లండులో హామండ్స్‌గారు న "పారిశ్రామిక కార్మికులు, వ్యవసాయ పనివారల కులు" పుస్తకం మరియు అనేకమంది ఆర్థికశాస్త్ర పరిశోధక వ్యాసాలు పరిశీలించి, నిరుద్యోగులుగా న్నా, తక్కువ వేతనాలు లభించినా పనిచేయడం చేనన్న నిర్ణయాన్ని వెలిబుచ్చారు, ఇంగ్లండులో శ్రామిక ప్రగతికోసం మిల్లు యజమానులు మానవ లతో సాగించే పోరాటం, వారికయ్యే [illegible] సమర్థనీయమైనవి కావని అభిప్రాయపడ్డారు. నల్లనే చేనేత పరిశ్రమను తగిన గుర్తింపు లని ఆచరణాత్మక నిర్ణయానికొచ్చారు. ఈ అభి యంతో తమ ప్రొఫెసర్లు, అంగీకరించకపోయినా అధ్యయనంపై పట్టప్రదానం జరుపకపోయినా, ోధనలో గైడ్‌గా ప్రొ॥ స్లాటరు గిల్‌బర్టుగారు ఆ యంలో ఏకీభావం వెలిబుచ్చారు. చివరకు పరీక్షాధి కూడా, ఇష్టంలేకపోయినా, అంగీకరించక తప్పింది

ఆంధ్రా జిల్లాల ప్రత్తి, పొగాకు పంటలపైనను, జౌళిపరిశ్రమ, చేనేత పరిశ్రమ, కుటీర పరిశ్రమలు, సహకార సంఘాలపై విస్తృతంగా ఆర్థిక పరిశోధనలు జరిపారు. ఆంధ్ర, తెలంగాణా, తమిళనాడులో పర్యటించి, డెల్టా, మెట్ట భూములపై లోతుగా పరిశోధన గావించారు. వారి పరిశోధనలను పరిగణనలోకి తీసుకొని మద్రాసు విశ్వవిద్యాలయాధికారులు వారిని [illegible]లుగా ఎన్నుకొనడం, [illegible] ప్రభుత్వం వారు ఆర్థిక సలహాదారుగా ఆహ్వానించడం విశేషించి తెలిసిన విషయమే. అనాడు, తమిళనాడు మలబారు, ఆంధ్ర దేశంలో జరిపిన వ్యవసాయ పరిశోధనలో రైతులకు జరుగుచున్న అన్యాయాలు, వారి దీనస్థితి, దైన్యస్థితులు సోదాహరణంగా ఉటంకించగా, ప్రభుత్వం ఆ సూచికలను సమగ్రంగా అమలు చేయనందుకు నిరసన తెల్పుతూ, ఆర్థిక సలహాదారు పదవినుండి బయటకు రావడం జరిగింది. ఇవన్నీ గమనించినప్పుడు రంగాజీలో నిర్మొగమాటం, తాను నమ్మిన సిద్ధాంతాలపై అచంచల విశ్వాసం, పదవులను ఖాతరుచేయక పోవడం, త్యాగం ప్రస్ఫుటంగా కనబడతాయి.

వ్యవసాయదారుల సభల్లోను, వ్యవసాయ కార్మిక సమస్యలతోను ప్రముఖనాయకుడుగా రూపొందడం జరిగింది. బాబూరాజేంద్రప్రసాద్ మొదలగు వారికి ఆశీస్సులను అందించారు. సర్దార్ పటేల్‌గారు మాత్రం రంగాజీతో ఏకీభవించినా, ముందు పార్టీతరువాత కిసాన్ సంఘాలన్నారు, రంగాజీ మాత్రం తాను కాంగ్రెసులో ఉంటున్నది గ్రామీణ ప్రజల అభ్యున్నతిని పార్టీ ద్వారా సాధించడానికి, దేశానికి స్వాతంత్ర్యం తేవడానికి అన్నారు. అలాంటి స్వేచ్ఛా భారతదేశం మాత్రమే ప్రజాభ్యున్నతికి తోడ్పడగలదన్నారు. మహాత్మాగాంధీ ఆ వాదాన్ని అంగీకరించారు. ఆ అంగీకారం పటేలు గారికి కొంత వైమనస్యాన్ని కలుగజేసింది.

1944 లో గాంధీజీ ప్రవేశపెట్టిన సమైక్యతా సాధన, ధర్మకర్తృత్వ విధానాన్ని ఖండిస్తూ కమ్యూ

స్టులు జాతీయవాదాన్ని తూర్పార పడుతున్న రోజులు. కమ్యూనిస్టులు వాదించేదేమంటే, కార్మికవర్గ నియంతృత్వమే జాతి అభివృద్ధికీ, సంపదకు ఏకైక మార్గము.

రంగాజీ బ్రిటీషు ప్రభుత్వ కంట్రోళ్ళపై విరుచుకుపడి, తన సోదరుడు లక్ష్మీనారాయణగారితో సహా జైలులో డిటెన్యూగా ఉన్న సమయంలోనే కార్మికవర్గ నియంతృత్వానికి వ్యతిరేకంగా "కిసాన్ మజ్దూర్" సిద్ధాంతాన్ని తయారుచేశారు. కమ్యూనిస్టు కషాయానికి ఆ సిద్ధాంతమే ప్రత్యామ్నాయంగా ప్రజలు అంగీకరించారు. పరస్పర సుహృద్భావంతో, దోపిడీకి తావులేకుండా, సమాజ ఆర్థికాభివృద్ధి సాధించవచ్చుని అదే కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్ సిద్ధాంతమని రంగాజీ చెప్పారు. ప్రభుత్వంలో ఉండే బ్రిటీషు పెత్తందార్లు, ఉద్యోగుల దంష్ట్రలనుండి. సామ్రాజ్యవాదులు, గుత్తపెట్టుబడిదార్లనుండి రైతులకు, గ్రామీణ జనాలకు రక్షణ కావాలని రంగాజీ చెప్పారు. అపుడే గ్రామాల అభ్యున్నతి సాధ్యమవుతుందని రంగాజీ వాదించారు. ఈ నినాదం క్విట్ ఇండియా తీర్మాన పాఠానికి అనుగుణంగా తయారు చేయబడింది. గాంధీజీకూడా దానికి ఆమోదముద్ర వేశారు.

రంగాజీ కృషికార్ లోక్‌పార్టీ అధినేత. వారి సభ్యులే నిర్ణాయక పాత్రధారులయ్యారు. ఇరుపక్షాలూ రంగాజీని ముఖ్యమంత్రిగా వుండడం మంచిదని ఆహ్వానించాయి. రంగాజీకి పదవి ముఖ్యమనిపించలేదు. కంట్రోళ్ళు ఎత్తివేసి ప్రజలకు పీడలేకుండా చేయాలనుకున్నారు. కంట్రోళ్ళు ఎత్తివేసే రాజాజీని నాయకుడిగా పిలుచుకొనడం మంచిదని ప్రకటించారు. రాజాజీ నాయకుడయ్యారు కంట్రోళ్ళను ఎత్తివేశారు. ఆవిధంగా కంట్రోళ్ళను, కమ్యూనిస్టు ప్రమాదాన్ని రంగాజీ నివారించారు.

1955లో మరల ఆంధ్రలో మధ్యంతర ఎన్నికలలో కమ్యూనిస్టు ప్రమాదం ముంచుకొచ్చింది. షరతులతో కాంగ్రెసు యునైటెడ్ ఫ్రంటు కట్టి ఐక్య కాంగ్రెసును గెలిపించి కమ్యూనిస్టు ప్రమాదాన్ని నిరోధించారు

1959లో జాతీయ అభివృద్ధిమండలి, ప్రణాళికా సంఘము, సోషలిస్టు జింజర్ గ్రూప్‌లు, 3వ ప్రణాళిక ద్వారా నిర్బంధ సహకార వ్యవసాయాన్ని ప్రవేశపెట్టాలని తీర్మానించారు. దీనికి మద్దతుగా కర్ణాటక రాష్ట్రం ఎల్వాల్‌లో కాంగ్రెసు, తదితర రాజకీయపక్షాలు కమ్యూనిస్టులు, వినోబాభావే సమావేశమై చివరకు సౌహార్ద్ర ప్రతినిధిగా దేశాధ్యక్షులు రాజెన్‌బాబు కూడా హాజరయి గ్రామదాన తీర్మానాన్ని ఆమోదించారు. దానికి మత రంగు కూడా కొంత పులిమారు.

రంగాజీ సిద్ధాంతకర్తయైనందువలన ఈ కుహనా రాజకీయ ఎత్తుగడలకు, ఈ పేరు మోసిన నాయకుల కుట్రలకు, కుతంత్రాలకు బెదిరిపోలేదు. లొంగలేదు. ధీరోదాత్తుడయినందువలన తన కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ కార్యదర్శి పదవికి రాజీనామా చేసి నాగపూర్ కాంగ్రెసు తీర్మానానికి వ్యతిరేకంగా సమరశంఖం పూరించారు. దేశవ్యాపితంగా ఉద్యమం లేపదీశారు. సహకార వ్యవసాయ నినాదాన్ని ఖండించి తూర్పార పట్టారు. ఎల్వాల్ కుట్రను భగ్నం చేస్తానని ప్రతిజ్ఞ చేశారు. అడుగడుగునా నెహ్రూజీ కుహనా కమ్యూనిస్టు విధానాలను వ్యతిరేకించారు. రాజకీయ స్థితప్రజ్ఞుడు రాజాజీ కూడ ఎల్వాల్ కుట్రను ఖండిస్తూ రంగాజీని సమర్థించారు. సారూప్య భావాలున్న రాజకీయ నాయకులను, మేధావులను, తత్వవేత్తలను, పండితులను చేరదీసి స్వతంత్ర పార్టీని స్థాపించి రాజాజీ అండగావుండి రంగాజీని పార్టీ అధ్యక్షునిగా చేశారు. ఆనాడు పార్టీ పెట్టి నెహ్రూజీని వ్యతిరేకించకపోతే గ్రామీణజనాల, స్వయంవృత్తుల వారి అస్థిత్వం వుండేది కాదు. సమిష్టి వ్యవసాయ చట్రంలో బానిసలుగా మారిపోయేవారు. యాంత్రికంగా స్వేచ్ఛలేని మూగజీవాలయ్యేవారు. అందువలనే రంగాజీ వారికి రక్షగా నిలిచారు. మరోసారి తన

స్వతంత్ర ప్రవృత్తిని ప్రదర్శించి తన స్వయంవృత్తుల సిద్ధాంతాన్ని కాపాడుకొన్నారు.

నెహ్రూజీ అంతటితో ఊరుకోలేదు. రైతు భూములను ఎస్టేటులుగా మార్చి రైతు స్వామ్యాన్ని హరించి రైతులను కూలీలుగానో, పకీరులుగానో తయారు చేయాలనుకున్నాడు. 1963 బడ్జెటు సమావేశ చివరి రోజున గప్‌చుప్‌గా ఈ బిల్లు 17వ రాజ్యాంగ సవరణగా ప్రవేశపెట్టాలను కొన్నారు. ఆ కుట్రను ముందుగానే రంగాజీ పసికట్టారు. దేశ వ్యాపితంగా నిరసనోద్యమాన్ని సాగించారు. మాబోంట్ల మందరము లక్షలాది టెలిగ్రాములు, ఉత్తరాలు లోక్‌సభ సెక్రటేరియట్‌కు పంపించుతూ, 17వ రాజ్యాంగ సవరణ బిల్లు ఉపసంహరించాలని కోరాము.

కాంగ్రెసుపార్టీ సంఖ్యాబలం వుంది. ప్రభుత్వం చేతిలో వుంది. కాని రంగాజీకి పార్లమెంటులో అనుభవం ఉంది, నైతికబలం వుంది, సౌశీల్యం వున్నది, మిత్రుల యెడ వాత్సల్య ముంది, వీటన్నిటికన్నా ప్రజాసేవయే ఆయన పరమావధి. వారి ఔన్నత్యమే వారికి జీవనాడి వీటన్నిటిచే రంగాజీకి అండ చేకూరింది. లోక్‌సభలో బిల్లు ప్రవేశపెట్టబడినది. ప్రజాభిప్రాయం లోక్‌సభ సభ్యుల చెవుల్లో ప్రతిధ్వనించింది. 17వ రాజ్యాంగ సవరణ బిల్లు ఓడిపోయింది. రంగాజీ గెలిచారు. స్వంత వృత్తులవారికి జై, జై అనే నినాదాలు పిక్కటిల్లాయి. తన సిద్ధాంతబలంతో, నైతిక ఋజువర్తనతో కోటానుకోట్ల వ్యవసాయ కుటుంబాలను, కమతాలను, కళాకారుల, బుద్ధిజీవుల, గ్రామీణ జనాలను కాపాడిరి.

ఈ దేశంలో కమ్యూనిస్టు రష్యా అనుసరణ రాజకీయాలు నెహ్రూ హయాంనుండి ఒక్కుమ్మడిగా సాగుతూనే ఉన్నాయి. రంగాజీ ప్రజాస్వామ్య పద్ధతిలో వ్యతిరేకిస్తూనే యున్నారు. గ్రామీణ భరతావనికి పనికి రాని ప్రణాళికా విధానం, పారిశ్రామిక విధానాలు కొనసాగుతూనే వున్నాయి. పరిశ్రమలు అవసరమయినా, మూడింట రెండువంతులుగా వ్యవసాయికంగా వున్న దేశంలో గ్రామాల అభ్యున్నతి పట్టించుకోకుండా, పారిశ్రామికీకరణ వైపు పయనించి, గాంధీజీ వ్యతిరేక ప్రణాళిక అమలుపరచిన నెహ్రూజీ విధానాలు దేశాన్ని తప్పుదారి పట్టించాయి. రంగాజీ పోరాటాలు అధికారాన్ని అందుకోలేక పోయినా గ్రామీణజనాలకు స్ఫూర్తి నిచ్చినాయి, ధైర్యాన్ని సమకూర్చినాయి. ఎప్పటికపుడు రైతులను ప్రమాదాలనుండి కాపాడినాయి. దేశములో వ్యావసాయిక వ్యవస్థ దెబ్బతినకుండా హరిత విప్లవానికి తోడ్పడినాయి. మధ్యలో కొద్దికాలం పాటు కాంగ్రెసు పాలన పోయి జనతాపార్టీ వచ్చింది. రంగాజీ వ్యవసాయ విధానాలు అక్కడ రైతు నాయకుడు చరణ్ సింగు నేతృత్వంలో అమలు జరిగినాయి. దురదృష్టవశాత్తు ఆ ప్రభుత్వం కూలిపోయింది. ఐనా గ్రామీణ జనాలు విస్మరించబడకుండా ప్రతి రాష్ట్రంలో రైతు సంఘాలు, లోక్‌సభలో రంగాజీవాణి, వివిధ పార్టీలలో రైతు విధానాలపై మొగ్గ-రైతులకు బలం సంతరించి పెడుతున్నారు. రంగాజీకి నెహ్రూ లిటరసీ అవార్డు వచ్చినా సంతోషమే.

వీటన్నిటికన్న మిన్నగా రంగాజీ సిద్ధాంతకర్త. అంతర్జాతీయ అవగాహన వున్న బహుముఖ ప్రజ్ఞాశాలి, మేధావి, స్టేట్స్‌మన్, ఈ భూమికతోనే రంగాజీ సిద్ధాంత స్థితిగతులను పరిశీలిద్దాం.

రంగాజీ వామపక్ష ప్రజాతంత్ర రాజకీయవాదిగా జీవితం ప్రారంభించారు, విప్లవాత్మక ధోరణిలో యువ రాజకీయ నాయకునిగా పేరెన్నిక గాంచారు. జమీందారీ వ్యతిరేక పోరాటాలను నడిపి, వలసవాద తత్త్వానికి వ్యతిరేకంగా అంతర్జాతీయ వేదికలు నిర్మించారు. ఆ దశకంలోనే అఖిలభారత కిసాన్ సభను స్థాపించి రైతు ఉద్యమాలు నడిపించారు. దానితో కమ్యూనిస్టులు, సోషలిస్టులు రంగాజీతో చేరారు. రైతు ఉద్యమాలు దేశ వ్యాపితంగా బహుముఖంగా సాగాయి. కొంతకాలానికి ఈ కిసాన్‌సభ గాంధీజీ వ్యతిరేకులతోను. సోషలిస్టుల

తోను, కమ్యూనిస్టులతోను నిండినట్లయింది, ఎవరు ఎవరితో ఎంతకాలం కలిసి ఉంటారో తెలియని అనిశ్చిత పరిస్థితి ఏర్పడింది. వివిధ అభిప్రాయాలు కలిగినవారూ. వారివారి ఆలోచనలను సమర్థించే వర్గాలను పెంచి పోషించుకోవాలని తాపత్రయపడ్డారు. ఐతే బాపూజీ ఈ వర్గ సంఘాలకు, సోషలిస్టు, కమ్యూనిస్టు సిద్ధాంతానికి వ్యతిరేకి. రంగాజీకూడా మౌలికంగా విప్లవాత్మకభావాలు కలవారైనా. మూలసిద్ధాంతంతో భేదిస్తూ వస్తున్నారు. ఇక్కడ ఉద్యమస్థాయి పెరిగిన కొలదీ మూలసిద్ధాంతం స్వరూపం ప్రస్ఫుటంగా కనుపించింది. కమ్యూనిస్టులు కార్మికవర్గ నియంతృత్వానికి కైమోడ్పు లిచ్చేవారు (Proletarian dictatorship) రైతులను వారు కార్మిక విప్లవానికి తోడుగా ప్రచారానికి మాత్రమే పనికి వస్తారనే అంటూ ఉండేవారు. రంగాజీ మార్క్స్ మూల సిద్ధాంతంతో భేదించింది ఈ విషయం దగ్గరే. రంగాజీ రైతుకూలీ, ప్రజారాజ్యం-కావాలంటారు. మార్క్సిస్టులు కూలీ, రైతురాజ్యం కావాలంటారు. రంగాజీ రైతులకు భూములపై ప్రాథమిక స్వత్వాలుండాలంటారు, కమ్యూనిస్టులు అలా ఉండకూడదంటారు. ఇలా విరుద్ధ ప్రవృత్తులు కలిగినది కిసాన్ సభ. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో రష్యా యుద్ధంలో ప్రవేశించగానే దాన్ని ప్రజాయుద్ధంగా ప్రకటించి కమ్యూనిస్టులు బజారున పడ్డారు. రంగాజీ వారితో విభేదించారు. రంగాజీ జైల్లో ఉండగానే కమ్యూనిస్టులు కుట్రలుపన్నారు, రంగాజీ "రైతుకూలీ ప్రజారాజ్యం" ఆశయముతో వారు దూరమయ్యారు, రంగాజీ కార్మికవర్గ నియంతృత్వ ప్రమాదాన్ని, అంతర్జాతీయ అవగాహనగల చరిత్రాధారాలతో బట్టబయలు చేశారు. ఫ్రాన్సు దేశంలో రాజులకు వ్యతిరేకంగా విప్లవంవస్తే. దాని విజయం కోసం రైతాంగం ఎంతో త్యాగం చేసింది, కాని పెత్తనం నెపోలియన్ చేతులలోకివెళ్ళి నియంతృత్వంగా మారింది. అలాగే జర్మనీ రైతాంగ త్యాగఫలంవల్ల వచ్చిన ఫలితం హిట్లరు హస్తగతమై ప్రపంచానికే ముప్పుతెచ్చింది. రష్యాలో జారు చక్రవర్తులకు వ్యతిరేకంగా వచ్చిన విప్లవంలో రైతాంగం చేసినంత త్యాగం ఏ వర్గమూ చేయలేదు. కాని ఆ త్యాగ ఫలితం కమ్యూనిస్టులకు దక్కింది, దక్కటమేకాక రైతాంగ విప్లవాన్ని సమూలంగా నాశనం చేసింది, అందువల్లనే రంగాజీ, కమ్యూనిజంలో కార్మికవర్గ నియంతృత్వం పొంచి ఉన్నదని, భారత స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరుస్తూనే రైతాంగాన్ని రెండో పోరాటానికికూడా సన్నద్ధులుగా ఉండమని ఆనాటినుండీ హెచ్చరిస్తూనే వచ్చారు. కమ్యూనిస్టు సిద్ధాంతంప్రకారం రైతులకు భూస్వత్వాలు ఉండవు. వ్యక్తిస్వేచ్ఛ లేదు, భద్రత లేదు. రష్యాలో లెనిన్ హయాంలో మొదలయి, స్టాలిన్ పాలనాకాలంలో కార్మికవర్గ పెత్తనం కోసం లక్షలాది రైతులను హత మార్చారు. సమూలంగా రైతాంగవ్యవస్థ రూపుమాపింది.

అందుకే రంగాజీ మన దేశంలో స్వాతంత్ర్య సముపార్జనకొరకు ఉద్యమంలో పాల్గొంటున్న రైతులు చేతివృత్తులవారికి ప్రధానంగా గుర్తింపు ఉండాలి. దేశ ఆర్థిక వ్యవస్థలో వారే ప్రధాన భూమిక వహించుతారని దేశసౌభాగ్యానికి వారే మూలకందమని — బాపూజీకి సుదీర్ఘ చర్చలలో వివరించారు. ఆ చర్చల అనంతరమే 1944 సం॥లో బాపూజీ "రైతుకూలీ ప్రజారాజ్య" మే నా ఆశయం అని ప్రకటించారు.

క్రమక్రమేపీ రంగాజీ బాపూజీకి అత్యంత సన్నిహితుడుగా మారుతూ వచ్చారు. నెహ్రూజీ కంట్రోల్సు విషయం, మొదలుగాగల కొన్నివిషయాలలో బాపూజీతో భేదించారు. రైతు వ్యతిరేక ధోరణి వ్యక్తమైంది. నెహ్రూజీ దృష్టివేరని, నెహ్రూ నాయకత్వానగల కాంగ్రెసుప్రభుత్వం రైతుల గ్రామీణప్రజల సమస్యల నర్థంచేసుకొని వారి హక్కుల రక్షించజాలదని బాపూజీ చివరి రోజులలో గ్రహించి రైతే రాజు కావాలనే తన ఆశయమని ప్రకటించారు కూడా. దురదృష్టవశాత్తు స్వాతంత్ర్యం వచ్చిన కొద్ది రోజులకు బాపూజీ మనకు దూరమై స్వర్గధామం చేరారు. బాపూజీ ఆశించిన, కలలుగన్న రైతురాజ్యం, రామరాజ్యం మనకు సిద్ధించ లేదు. బాపూజీ మరణానంతరం రంగాజీని అర్థం చేసు

కున్నవారు అంతగా లేరు. బాపూజీలాగా నైతికవత్తాసు ఇచ్చిన వారెవరూ లేరు. మన దురదృష్టం. రైతులకు హామీలేకపోయింది. స్వయంవృత్తుల వారికి రక్షణలేక పోయింది.

ఈ నేపథ్యంలో 1946, 1947 సంవత్సరంలలో రంగాజీ లండన్‌లో, కోపెన్‌హాగన్‌లో ప్రథమ, ద్వితీయ, అంతరాతీయ వ్యవసాయోత్పత్తిదారుల మహా సభలోను, 1948 శాన్‌ఫ్రాన్సిస్కోలో అంతర్జాతీయ లేబర్ యూనియన్ మహాసభలోను, 1949 లో కెనడా అంతర్జాతీయ వ్యవసాయోత్పత్తిదారుల మహాసభలోను మరల 1954 లో నాల్గవ అంతర్జాతీయ కర్షక మహాసభ న్యూయార్క్‌లోను పాల్గొని అనేక రైతాంగసమస్యలు కార్మిక సమస్యలకు పరిష్కార మార్గాలను అన్వేషించారు. 1954 సం॥లోనే జపాన్‌లో వసుధైక ప్రభుత్వ ఉద్యమ మహాసభలో పాల్గొన్నారు. ఈ సమయంలో సహకార చేతిపరిశ్రమలను పరిశీలించారు.

1955వ సం॥లో సోవియట్ రష్యా సందర్శించి రైతుల బాగోగులను, వ్యవస్థను - మనదేశ ఆర్థిక వ్యవస్థను దృష్టిలో నుంచుకొని పరిశోధించారు.

రష్యా అధినేత శ్రీ గోర్బచేవ్ పెరిస్త్రోయికా (పునర్నిర్మాణం) చేస్తానంటున్నారు. గ్లాస్‌నాస్ట్ (స్వేచ్ఛాభిప్రాయం) తో ఆత్మవిమర్శ చేసుకుంటామంటున్నారు. అంతరాతీయ సంబంధాలు మానవతా దృక్పథంతో పునః పరిశీలించుకొంటామంటున్నారు. సోషలిస్టు సమాజ అవకతవకలను సరిజేసుకుంటామంటున్నారు. క్రొత్త వ్యవస్థకు నాంది పలుకుతామంటున్నారు. అంటే ఇది వరలో ఇవన్నీ తప్పుదారిన నడచినట్లేనా? ఐతే క్రొత్త వ్యవస్థ ఎలా ఉండాలి? ఇవన్నీ ఉదయించే ప్రశ్నలు.

వీటన్నిటినీ దూరదృష్టితో అపార అనుభవముతో రంగాజీ ముందుగానే దర్శించ గలిగారు. రాబోయే దుష్పరిణామాల్ని 40, 50 సం॥ల క్రితమే - ఏకరువు పెట్టారు. విన్నవారెవరు? ఫలితం అనుభవించారు. ఐతే నైరాశ్యంకూడదు. శాంతియుతంగా మార్పురావాలి. మనదేశంలోకూడా ఆఫీసర్ల పెత్తందారీతనం (Beaurocracy) యెక్కువయిందని లంచగొండితనం అంచెలంచెలుగా పెరిగిపోయిందని, తాను మొదటి ప్రణాళికా కాలంలోనే సూచించిన భూమి స్థిరీకరణ, మద్దతుధర, మేలురకం విత్తనాల సరఫరా, పంటల సమగ్ర భీమా పథకం, గ్రామాలకు రక్షిత మంచినీటి సరఫరా, రవాణా సౌకర్యాలు - ఇంకా అమలుకావలసి ఉన్నవని, నిరక్షరాసత్యత తొలగించబడలేదని, ఉదాసీన్యం ప్రబలిపోయిందని, సమాజంలో అవగాహన లోపించిందని, గ్రామీణుల, స్వయంవృత్తుల వారి వ్యవస్థ పటిష్ఠం చేయవలసిన అవసరం ఎంతగానో ఉన్నదని, కష్టకాలాలలో రైతులను ఆదుకొనేందుకు, వ్యవసాయ శాశ్వత రక్షణ నిధిని ఏర్పాటు చేయాలని రంగాజీ లోక్‌సభలోను, అనేక సదస్సుల్లో హెచ్చరిస్తున్నారు. ఈ మాట సామాన్యుల మాటకాదు. అనుభవం పండిన అధినాయకునిమాట, బాపూజీచే కొనియాడబడిన మరో బాపూజీ (రంగాజీ) మాట. ఈ సలహాలు పెడచెవినిపెడితే, అమలుపరచలేకపోతే రైతులకు శాస్త్రీయ జ్ఞానాన్ని అందించకపోతే, పెరిగేజనాభా ఇలానే పెరిగిపోతే,మనం ఈనాడు రష్యా ఎదుర్కొంటున్న సంక్షోభానికి ఎంతో దూరం లేము. అంతేగాక - ప్రజాబాహుళ్యం ఎక్కువగావున్న మనదేశంలో యింకా ప్రమాదం ఇనుమిక్కిలిగా వస్తుందనేదే రంగాజీ అభిప్రాయం సమస్యల పరిష్కారానికి రంగాజీ సూచనలు రాజకీయాలకు అతీతంగా ఉంటాయి. రంగాజీ రాజకీయాలు దేశాన్ని దృష్టిలో పెట్టుకునే ఉంటాయి. స్వార్థ రాజకీయాలకు ముడిపడి ఉండవు. మన దేశ ప్రజల దురదృష్టం వారి సలహాలను ఆచరణలో పెట్టుకోలేక పోతున్నాం. వారి అనుభవాన్ని వినియోగించుకోలేక పోతున్నాం. వారిని అత్యున్నత పదవిలోకి ఆహ్వానించుకొని సలహా సంప్రదింపులతో ప్రభుత్వం నడుపుకోలేక పోయాం. వారి అపార రచనా సంపదను ప్రజలకు అందించుకోలేక పోతున్నాం. బాపూజీ కాంక్షించిన భారతాన్ని, కలలుగన్న ఆశయాన్ని బేరీజు వేసుకుంటే నేటి భారతం రంగాజీకి హృదయవేదన కలుగజేస్తుంది రష్యాలోలాగా ఎన్ని పెరిస్త్రోయికాలు మనదేశంలో

చేయాల్సినవస్తాయో - మనకు గ్లాస్‌నాస్ట్ అవసరంలేదు. కాని థింక్ ఫస్ట్ అండ్ వాక్ నెక్స్ట్ (Think first and walk next), బీ వైజ్ అండ్ సూపర్‌వైజ్ (Be wise and surperwise) మనకు వ్యక్తిపరంగాను, ప్రభుత్వపరంగానూ అమలుపరచవలసివుంది. యీ ఆలోచన, యీ ఆత్మవిమర్శ, అక్షరాస్యత కొరవడిన సమాజంలో, దేశంలో ఏదీ అమలు కాదు. ఇటీవల రంగాజీ వయోజన విద్యను 41 సంవత్సరాల స్వాతంత్ర్యానంతరం కూడా సంపూర్ణంగా అమలుపరచకోలేక పోయాం. ఆత్మవిమర్శ చేసికోవాల్సి ఉంటుందన్నారు. వారి అభిప్రాయాలను మననం చేసుకొని దేశావసరాలకు ఏమి అవసరమో క్రియాత్మక దృష్టిలో ఆలోచింపుకోవాలి.

వారి మాటలు ఎల్లప్పుడూ శిరోధార్యం. ఎందుకంటే రంగాజీ సిద్ధాంతకర్త. రంగాజీ ఒక వ్యక్తికాదు, ఒక మహావ్యవస్థలాంటివారు. వారిని రాజకీయదృష్టితో కొలవకూడదు, వారిని సిద్ధాంతకర్తను చూచేవిధంగా చూడాలి. వారు ఋషితుల్యులు. ఈ క్షుద్ర రాజకీయ సంస్కృతికి అతీతులు. వారెప్పుడో రాజాజీ, బాపూజీ నాటి నైతిక స్థాయికల దూరదృష్టిగల రాజనీతివేత్తల స్థాయికి ఎదిగిపోయారు. ఆలోచనాపరులు, నైతిక విలువలున్నవారు రంగాజీని ఆ దృక్పథంతోనే చూస్తారు.

ఇలాంటి జన్మదిన వేడుకల్లో వారిని ప్రజలు, ప్రభుత్వం గౌరవించుకోవాలి. వారి సలహాలను శిరోధార్యంగా పాటించాలి. వారి సిద్ధాంతాన్ని అమలుపరచుకోవాలి. అదే వారికానందం. దేశానికి శ్రేయస్సు. మన హృదయాలకు స్పందన - సిద్ధాంతకర్తకు, గురూజీకి మనఃపూర్వక వందనములు.



# నాకు నచ్చిన, నేను మెచ్చిన ఆచార్య రంగా

— 'పండిత' గుత్తికొండ సీతారామయ్య, కొల్లూరు.

ఆచార్య రంగా యావద్భారత కర్షకోద్యమ విధాతగా, దీనజనత్రాతగా, రైతాంగనేతగా, కష్టజీవుల భ్రాతగా, పేదలసాదల పెన్నిధిగా, పీడితతాడితజన సన్నిధిగా కారుణ్యసేవాకుసుమాలను మాలగా ధరించి వెలిగారు.

"ఉదారచరితానాంతు వసుధైక కుటుంబకమ్" అను సుమధుర సూక్తుల నాకళించుకొని వసుధయే కుటుంబముగా భావించిన ఉదారచరితులు. పూవు పుట్టగానే పరిమళించునను నానుడి చొప్పున రంగాజీకి చిన్ననాటనే "జాతీయత" "దేశభక్తి" "ప్రజాసేవ" వెన్నతో పెట్టిన విద్యలు. ఉగ్గుపాలతో రంగరించి పోసిన గుణములు. రంగాజీ జీవితము ఒక రాజకీయ విశ్వవిద్యాలయము. కల్లకపటమెరుగని రైతుల మనసే ఆయన మనసు. వారి రక్తము ఆయనలో జీర్ణమై పోయినది. లండన్‌లోని ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయములో అర్థశాస్త్రములో ఆరితేరినవాడైనను కట్టులో, బొట్టులో, మాటలో, మంతిలో, ఆచార వ్యవహారములలో మూర్తీభవించిన రైతు తత్వమే, నిరాడంబరత్వమే ఆయనలో గోచరమగును.

మదరాసులో పచ్చయప్ప కళాశాలలో ఆర్థికశాస్త్ర ప్రొఫెసరుగా నియమింపబడ్డారు. కొన్ని వేలమంది విద్యార్థులను సుశిక్షితులను చేసినారు. భారతీయ చేనేత పరిశ్రమపై పరిశోధన చేసి సిద్ధాంత గ్రంథమును రచించి "డాక్టరేట్" పొందారు. పూజ్య బాపూజీ స్వాతంత్ర్య శంఖారావ మాకర్ణించి పచ్చయప్ప కళాశాలలోని ఆచార్య పదవిని తృణప్రాయముగా భావించి దేశ దాస్య విచ్ఛిత్తికై స్వాతంత్ర్య సమరములోని దుమికి కారాగార క్లేశము అనుభవించారు.

రంగాజీ ఏబదియేండ్ల పార్లమెంటరీ జీవిత మధురానుభూతులను, 60 ఏండ్ల ప్రజాసేవా జీవితాన్ని సదవగాహనతో సమీక్షించినట్లయిన ప్రత్యేక వ్యక్తిత్వము ప్రస్ఫుటము కాగలదు. శ్రీ రంగా చేపట్టిన ఉద్యమాల ప్రభావము వలన కంట్రోళ్ళు, రేషనింగులు రద్దయినవి. నెహ్రూజీ అభిలషించిన సాముదాయక సహకార వ్యవసాయ విధానము అమలుజరుపకుండా నిలిచిపోయినది. వ్యవసాయోత్పత్తులకు గిట్టుబాటుధరలు లభించినవి. పంటలు,పశువులకు భీమా సౌకర్యము ఏర్పడినది. వయోజనులకు ఓటింగు విధానము అమలు జరిగినది.

కొందరు కారణజన్ములు చరిత్రనే సృష్టించెదరు. చరిత్ర కొందరు వ్యక్తులను సృజిస్తుంది. మొదటి కోవకు చెందినవారు ఆచార్య రంగా. జవహర్‌లాల్ నెహ్రూ పురస్కారము రంగాజీకి దక్కుట యశస్కరము. రైతురంగా రెండుతరాలకు వారధి. వివేకనీరధి. దేశహితైక రథసారధి. దేశ స్వాతంత్ర్య సమరములో తన పాలు తాను చిత్తశుద్ధితో నిర్వహించాడు. అసంఖ్యాక ఉద్యమాలకు స్రష్టయై వినూత్న సంచలనాత్మక చరితను సృష్టించాడు. రైతు ఉద్యమము – జమీందారీ ఉద్యమము – కార్మికోద్యమము-కరకోద్యమము-మహిళోద్యమము–

చేనేత ఉద్యమము-ప్రపంచ కర్షకోద్యమము-వసుధైక ప్రభుత్వ విధానము ఇవన్నియు ఆయన హృదయ క్షేత్రములో పండించుకొనిన బంగారు రంగారు పంటలు. ఆంధ్రప్రదేశ్ నాలుగు చెరగులా ఆయన నిర్వహించిన రైతాంగ విద్యాలయాలు- ఇండియా పార్లమెంటుకు చెందిన పబ్లిక్ ఎకౌంట్సు కమిటీ అధ్యక్షులుగా అల్పకాలమే (ఒక సంవత్సరము) నిర్వహించినను అనల్పమైన సేవచేసినారని, పదిసంవత్సరాల కాలములో సాధించలేని విషయాలను అల్పవ్యవధిలోనే సామరస్యముగా సాదించిన దిట్టయని, ఇది చరితలో అనిదంపూర్వము, అనితర సాధ్యమని ఇందువలన ఆచార్య రంగా ముందుతరాల వారికి మార్గదర్శకులు కాగలిగినారని నాటి లోకసభ కార్యదర్శి శ్రీ ఎం. ఎన్, కౌల్ 1959 ఏప్రియల్ 31న చేసిన ప్రసంగమే ప్రబల దృష్టాంతము. న్యూయార్కులో ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశానికి భారతదేశము పంపిన ప్రతినిధి వర్గములో సభ్యులుగా గాంగనిర్ఘర సదృగ్ధారాళ వాగ్ధాటితో భారతవాణిని ఎలుగెత్తి చాటిన తీరు సమితి అధ్యక్షుని ఎంతగానో అలరింపజేసినది. రంగాజీ ప్రతిఫలాన్ని ఆశింపని కర్మయోగి. అజాతశత్రువు. మానవతావాది. ప్రజాసమస్యలను పరిష్కరించుటకై పుట్టిన ప్రజల మనిషి.

గాంధీజీ శతజయంత్యుత్సవాల సందర్భములో భారతదేశము తరపున ఏకైక ప్రతినిధిగా విదేశాలలో జరిగే బాపూజీ జన్మదినోత్సవాలలో పాల్గొని ఆయన నిర్మాణ కార్యక్రమాలను, సిద్ధాంతాలను బహుముఖ పాండితీ ప్రతిభతో చాటిచెప్పిన ఆచార్య రంగా చరితార్థుడు. ఏ అధికార పదవిని చేపట్టకుండగనే యావద్భారతావనిలో ప్రజల మనిషి. జనుల హృదయాలను సూదంటురాయివలె ఆకట్టుకొనగలిగిన దిట్ట. ఆయన గ్రామీణ రైతాంగ జీవి. వసుధైక కుటుంబము కొరకు తపన పడినవాడు- మథనపడినవాడు. తన కడుపులో సున్నదంతా శిష్యులకు చెప్పి తనంతవారిని చేయాలనే మనస్తత్వముకల మనిషి. వివిధవర్గాల వృత్తులవారిని ఉత్తేజితుల చేసి కాంగ్రెసు సంస్థను సామాన్య ప్రజల సంస్థగా తీర్చిదిద్దారు, తన సిద్ధాంతాలు, ఆశయాలు అమలు జరుగుటకు అధికార మక్కరలేదని పల్కిన విశాలహృదయుడు.

“నాయకులే సేవకులయినచో నితరులు నాయకత్వమునకు స్పర్ధ వహింపరు”. ప్రజాసేవా పరాయణులకు పదవులతో నిమిత్తము లేదు”. “స్వదోషములను పర్వతీకరించి పరదోషములను పరమాణువులుగా నెంచినప్పుడే గుణదోష నిర్ణయము సాధ్యము” అను పూజ్య బాపూజీ సిద్ధాంతాలను అణువణువునను జీర్ణించుకొనిన గాంధేయవాది. ఏనాడును గాంధీటోపీని విడనాడడు. కులాలమధ్య వివక్షలు, అంతరాలు తొలగించాలని- అంటరానితనమనేది భారతదేశాన్ని పట్టి పీడించుచున్న కట్టుకురుపు అని దానిని అంతముచేయాలని, సాంఘిక దురాచారాలను సమూలముగా పెరికివేయాలని, ప్రగతికి ప్రతిబంధకాలయిన కులాలనెడి అడ్డుగోడలను బద్దలు గొట్టాలని శపథము పూనినాడు. “హరిజన నాయకుడు” అను పేరుగల నవలను రచించినాడు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు రచించిన “మాలపల్లి” నవలను పెక్కుమారులు చదివి దానిపై సుదీర్ఘ సమీక్షను వ్రాసినారు. యూరప్ దేశాలవలే భారతదేశములో కూడ వయోజనులైన వారందరకు ఓటుహక్కు సౌకర్యము చేకూర్చుటకై ఆచార్య రంగా చేసిన కృషి, దీక్ష ఫలించినది.

ప్రజా సమస్యలపై మహమ్మదాలీ నిర్వహించిన “కామ్రేడ్” పత్రికలో ఆచార్య రంగా వ్రాసిన వ్యాస పరంపరపై బాపూజీ దృష్టి పడినది. ఆ వ్యాసాలు బాపూజీ హృదయాన్ని కదలించాయి. ప్రజాస్వామిక విధానానికి పట్టుగొమ్మలయిన, ప్రాణప్రదమయిన వయోజన ఓటింగు విధానము పూజ్య రంగా దీక్షవలన భారతదేశములో తొట్టతొలుత ప్రవేశపెట్టబడినవి. ఆచార్య రంగా ఆర్థికశాస్త్రంలో సిద్ధహస్తుడుగానే గాక ఆంధ్ర సాహితీ నందనోద్యాన సీమలో పదికాలాలపాటు నిలువగల, విలువగల పెక్కు గ్రంథాలను అంటుత్రొక్కాడు.

రంగనాథులు, హరిజన నాయకుడు, ఆధునిక రాజ్యాంగ సంస్థలు (1, 2 భాగాలు, 650 పేజీలు) చేనేత పరిశ్రమపై సిద్ధాంత గ్రంథము, విప్లవ రైతాంగము (ఆంధ్ర, ఆంగ్ల భాషలలో వెలువడిన గ్రంథము) వాహిని, గోభూమి, క్రాంతి పత్రికల నిర్వహణ-పాకిస్తాన్-100 పేజీల గ్రంథము) "కాకతీయ నాయక్స్ అండ్ పటిదావత్" చారిత్రక ప్రసిద్ధి చెందిన గ్రంథము. భారతీదేవి స్మృతులు. లక్ష్మీనారాయణ, నాగయ్య స్మృతులు రైతాంగ గీతాలు.

శ్రీమతి భారతీదేవి రంగాను భారతీయ స్వాతంత్ర్య సమర వీరునిగా తీర్చిదిద్దిన ఘనత ఆచార్య రంగాకే దక్కింది. ఆమె మహిళాలోకానికి మణిదీపం. భర్తతోపాటు కష్టసుఖాలను పంచుకొనిన సహధర్మచారిణి ఆచార్య రంగాకు ఆమెలేని కొరత తీర్చరానిది, మరపురానిది, మరువలేనిది. బ్రిటీషు సామ్రాజ్య కఠోర నిర్బంధము ఎదిరించి విజయమందిన భారతీదేవి రంగా చరితార్థులు, ధన్యజీవి.

ఆచార్య రంగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసునకు అధ్యక్షులుగా నున్న తరి జాతీయ విజ్ఞాన పరిషత్తును స్థాపించి దానికి "కవిబ్రహ్మ" ఏటుకూరి వేంకటనరసయ్య గారిని అధ్యక్షులుగా నియమించారు. ఆకర్షకవ్యగ్రణి కమనీయ దివ్య లేఖినినుండి రమణీ రమణీయ రచనలు వెలుగులోనికి వచ్చినవి.

క్షేత్రలక్ష్మి అలనాడు వెలయించిన రమణీయ కావ్యరాజము.

"రైతు ధనమ్ము నీ కృతి నింపరాదదా" అని ఆధునిక కవితా ప్రపంచమునకు ఏటుకూరి ఈ విధముగా హెచ్చరిక చేయుచున్నాడు. రంగాజీ ప్రబోధము వలననే

అందని దివ్యధామముల కహర్నిశ మిల్లెగ బ్రాకుచుండు నీ
డెందము లేకొయి! నందనము వేల యనంగల దేవతాప్సరో
బృందము లేల? చందనము లేల? ఈవి రా
నందమునిచ్చు రైతు ధనమ్మున నీ కృతి నింపగూడదా?

ఇంతకు నా పరాత్పరునకే దయగల్గిన రైతు రాజ్య మ
త్యంత విభూతి పెంపెసగదా! మన కర్షక సార్వభౌముడే
సంతసమురేని యీ భువన మంతకు శాసన కర్తయై నిర
ర్గ్యంతర పాలనం బొనరుపంగల భాగ్యము కల్గుటెన్నడో!

భారత, భాగవత, రామాయణాదులలోని కవితా మధువును సాహితీ పీయూషమును కంఠదఘ్నముగా ఆస్వాదించిన రసజ్ఞుడు.

"కవిబ్రహ్మ" ఏటుకూరివారి పలనాటి వీరభారతము, మగువ మాంచాల, క్షేత్రలక్ష్మి సిద్ధాశ్రమము నాయకురాలు, ప్రేమాలోకము.

"అభినవ తిక్కన" "కవివెంకి" తుమ్మలవారి "బాపూజీ ఆత్మకథ, దువ్వూరివారి "కృషీవలుడు" కావ్యములనిన మిక్కిలి మక్కువ. రసజ్ఞత లిధుల కొలదికల మనీషి విశేషించి పోతన యన్నచో రంగాజీ యెదంద కరగిపోవును.

ప్రపంచ కర్షకులారా! ఏకము కండని శంఖారావమును పూరించిన రైతుజన బాంధవుడు. రైతు-కూలీ-చేతివృత్తుల అశేష గ్రామీణ, శ్రామిక జనావళిలో చైతన్యం రేకెత్తించి కర్తవ్యపరాయణులను చేసిన ప్రజానాయకుడు.

పతిత జనోద్ధరణకై, హరిజన, గిరిజన, సన్నకారు-చిన్నకారు, వెనుకబడిన, బలహీన వర్గాలవారి ఆర్థిక, రాజకీయ, సాంఘిక న్యాయము కొఱకు, అనేక మహోద్యమాలను నిర్వహించి, విజయలక్ష్మినిక్కై చేసిన విజయుడు రంగాజీ.

జాతీయోద్యమానికి జీవితము సంకితముచేసిన త్యాగధనుడు-నీతి నిజాయితీలకు ప్రతీకగా నిలచిన నిష్కపటి, నిప్పులాంటి మనిసి. పదవులకై అఱ్ఱులుచాచని నిస్వార్థ సేవాపరాయణుడు. తనకు నచ్చిన, తాను మెచ్చిన ప్రజాసమస్యలను ప్రజాప్రతినిధుల కూడలి కేంద్రమయిన పార్లమెంటులో నిర్భయముగా కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పుటకు వెనుకంజవేయని మేరునగధీరుడు. సకాలములో పార్లమెంట్ సమావేశాలకు, హాజరగుటలో ఆయనకు మించినవారు లేరు. లోక్‌సభ కార్యకలాపాదులనుకూడ శ్రద్ధగా సదవగాహనతో ఆమూలాగ్రముగ ఆలించి పాలింపగలవారు అరుదని ప్రధాని రాజీవ్‌గాంధి ప్రశంసలందుకొన్న నాయకోత్తముడు. నిష్కళంక జాతీయవాది. నిరుపమాన త్యాగశీలి, సహస్ర మాస జీవితాన్ని అధిగమించి అనుభవించిన దీర్ఘాయుష్కుడు.

ఫిబ్రవరి బడ్జెట్ సమావేశంలో మరపురాని, మరువలేని మధుర ఘట్టం. అలనాడు ఆయన చేసిన ప్రసంగం కలకండ పలుకువై, విరిదేనె చినుకువై సభ్యుల డెందములకానందమును చూడ్కికి వేడ్కయును కల్గించి వెనుకటితరములోని పక్కా మహావక్తలను మరపించి ఎంతగానో మురిపింపచేసింది, అదియే ఆయన కీర్తి కిరీటానికి కలికితురాయి, నవంబరు 7 కర్షకలోకమున కొత్త వినూత్న పర్వదినము, అది రైతు దినోత్సవంగా ఆంధ్ర ప్రభుత్వము ప్రకటించి తన విజ్ఞతను చాటిచెప్పింది.

ఆచార్య రంగా 89 వ వసంతములో అడుగిడబోవుచున్నను ప్రజాసమస్యలపై తరగని, చెరగని తపన, రైతాంగముపై మరపురాని, మరువలేని మమత, ఆరని తీరని ఆరాటానికి, అసలైన, సిసలైన ప్రజల ప్రతినిధి అని చెప్పుటకు నూటికి నూరుశాతము అర్హతను సముపార్జించుకొన్న మహితాత్ముడు.

శేషజీవితాన్ని భరత జనయిత్రి దివ్యచరణాలకు భవ్యనీరాజనా సేవాకుసుమాలు సమర్పించాలని శతాధిక వసంతాలతో గడపాలనీ, సుఖమయ జీవితం నడపాలని నిండు హృదయంతో "పండిత గుత్తికొండ" భక్త్యంజలి సమర్పిస్తున్నాడు.

నీతి నిజాయితీలుగల నేత పటంబును భారతాంబకున్
ఖ్యాతిని గూర్చు వాడవను కాంక్ష మెయిన్‌కన మున్న మున్నెనే
అశతభక్తి పూర్ణమయి యంటలి పట్టి వరించె "రంగ" వి
ఖ్యాత యశో విశాల సముదాత్త ఖనీ! ఉపనాయరంగజీ!
భాసుర భారతావనికి బంగరుపంట వరాలమూటగా
భాసిలినట్టి భవ్యగుణ పావన నెహ్రూ అనుంగుపట్టి యా
వాసము వీడి జాతి సుఖవార్ధిని వర్ధిలజేయ నెంచె మీ
రాను చరిత్ర భారత మహోజ్జ్వల గాథల ద్రవ్వి పోసియున్
వాసియు వన్నెగూర్చియును వర్ధిలు దాశశితారకమ్ముగన్

'పండిత' గుత్తికొండ సీతారామయ్య
తెలుగు లెక్చరర్
శ్రీ రామా రూరల్ రెసిడెన్షియల్ జూనియర్ కళాశాల
చిలుమూరు.

# జ్ఞప్తి — విజ్ఞప్తి

— శ్రీ బి. నారాయణరావు

రావలె రైతుకూలి జనరాజ్య మటంచు తపించు నాయకా
భావన కాలమిచ్చి సహభాగినివై సతతమ్ము భారిపె
దేవివి రంగనాయకుని దీరిచి దిద్దిన దన్ను మూర్తికిన్
చేవగలట్టి మీ యనుగు శిష్య గణమ్ములు సాటి నేరకన్.

కనిపించు నీ మహో కాంతి రామానీకు
        విద్యాలయమ్ము కీర్తి వెల్గువందు
వినిపించు నీ వాణి విశ్వజనీనమౌ
        రంగాజి దివ్యాంతరంగ మందు
వినిపించు నీ పేరు నిఖిల శిష్య గణాన
        భాస్కరోదయ నభో భాగమందు

బహువిషయమ్ముల పతితోడ సహకరించ
మగువ మాంచాల పానమ్మ మల్లమాంబ
రుద్రమాంబ నాగమ్మల రూపు గొన్న
తెలుగు వనితవు భారతీదేవి నీవు

కష్టపడెను రైతు కండపట్టెను సాహూ
బక్కచిక్కి నితడు బలిసె నతడు
నట్టి దుక్కి దున్ని గుట్టాల మేపుటా
సాగగూడదన్న సాధ్వి యామె.

చెప్పు గుట్టువాని చిన్నారి పాపడు
బుట్టలల్లు వాని బుల్లిపిల్ల
పైకి రాని నాడు పారతంత్ర్యమె గాద
యంచు నలమటించు నతివ యామె

ఆగిపోలేదుగా అంధ విశ్వాసాల
        ప్రోషించి పెంచి పోషించు జడత
ఊగి పోలేదుగా విద్వేష భావాల
        దుష్ట ప్రచారంపు దొంగమమత
మారిపోలేదుగా మాయా కుతంత్రాల
        వింత యుద్ధాలు గల్పించు నడత
కూలిపోలేదుగా కుటిల ప్రబోధాల
        కాలుష్య పూర్ణ దుర్గంధ దృఢత

దోచుకొనుటలు మోసమ్ము లూచకోత
లున్న నీ మాతృదేశమ్ము నుద్ధరింప
భారతీదేవి చూపిన బాట నెపుడు
జ్ఞప్తికిం దెచ్చుకొనుడు విజ్ఞప్తి యిదియె.

—o—

"క్షేత్రలక్ష్మి" కవిబ్రహ్మ ఏటుకూరి

ఇంతకు నా వరాత్సరువకే దయదల్గిన రైతు రాజ్య మ
త్యంత విభూతి పెంపెసగదా! మన కర్షక సార్వభౌముడే
అంతములేని యీ భువన మంతకు శాసన కర్తయై నిర
ల్యంతర పాలనం బొనరుపంగల భాగ్యము గల్గుటెన్నడో?

# ధన్యజీవి ఆచార్య రంగా

— పావులూరి శ్రీమన్నారాయణ

దేశానికి స్వరాజ్యం రావడంతో ఇంగ్లండులో నాలుగు వందల సంవత్సరాలుగా నడుస్తున్న పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ ప్రాతిపదికపై రాజ్యాంగాన్ని ప్రభుత్వ యంత్రాంగాన్ని మన జాతీయనాయకులు ఏర్పాటు చేశారు. వయోజన ఓటింగు హక్కుతో ప్రభుత్వ నిర్మాణ శక్తి ప్రజలకు లభించింది. బహుజనుల బలముతో వచ్చిన ప్రభుత్వము సర్వజనుల అభ్యున్నతికి కృషిచేయవలసి యున్నది. లిఖితపూర్వక శాసనాలతోపాటు, నీతినియమాలతో సత్సంప్రదాయాలను (Conuentions) కల్పించి, గౌరవించి, కొనసాగించి, పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థను సుస్థిరపరచవలసిన బాధ్యత విజ్ఞతగల ప్రజలపైన, నాయకుల పైన పడినది.

తొలి ప్రధానిగా వచ్చిన పండిత జవహర్‌లాల్ నెహ్రూ యొక్క అనుచిత ప్రభుత్వ విధానాలు మన ఆర్థిక వ్యవస్థను బలహీనపరచసాగాయి. సోషలిజం పేరుతో దేశానికి వెన్నెముక అయిన రైతును, వ్యవసాయాన్ని, గ్రామీణ వ్యవస్థను నెహ్రూ ప్రభుత్వం దెబ్బకొట్టడానికి యత్నించింది. భూమిపై రైతులకున్న హక్కును రద్దుపరచడానికి, రైతుల భూవసతికి పరిమితులు విధించడానికి, పట్టణాలలోని వర్తక, వాణిజ్యాలకు, పరిశ్రమలకు, పెట్టుబడులకు స్వేచ్ఛను కల్పించడానికి నెహ్రూ యత్నించాడు. నెహ్రూ విధానాలకు మద్దతుగా భూమిపై హక్కును పంచాయితీల పరము చేయాలని శ్రీవినోబా భావే కూడా ఎల్‌వాల్ గ్రామంలో జరిగిన సభనుండి పిలుపునిచ్చి, రైతుకుటుంబ వ్యవస్థను సర్వోదయం పేరుతో విచ్ఛిన్నం చేయ యత్నించాడు.

పారిశ్రామిక పెట్టుబడిదారులవలె స్వంత భూమిగల రైతులను దోపిడీవర్గమని, బూర్జువా వర్గములో భాగస్థులని, రైతాంగము అభివృద్ధి నిరోధకులని, విప్లవ ప్రతిఘాతుక శక్తులని భారతీయ కమ్యూనిస్టులు రైతాంగమును వర్ణించారు. పెట్టుబడిదారులమీద ఆంక్షలు విధించకుండా, భూసంస్కరణల పేరుతో రైతులను అదుపులో పెట్టడానికి నెహ్రూ ప్రభుత్వము కమ్యూనిస్టులు ప్రయత్నించారు. సోవియట్ రష్యాను అనుకరించి మనదేశంలో సహకార వ్యవసాయాన్ని ప్రవేశపెట్టడానికి నెహ్రూ గట్టి ప్రయత్నం చేశాడు. దీనికి పెట్టుబడిదారుల పత్రికలు వంతపాడినాయి. కాని అహమ్మదాబాద్ సమావేశంలో మాట్లాడుతూ, పారిశ్రామిక రంగంలో కూడా సహకార సిద్ధాంతం ప్రవేశపెట్టాలని నెహ్రూ చెప్పగానే పెట్టుబడిదారుల పత్రికలు నెహ్రూపై ధ్వజమెత్తినాయి. What Nehru talks is economic rubbish అని, ఆమరునాడు Indian Express సంపాదకీయం వ్రాసింది.

రైతు కుటుంబంలో పుట్టి ఆక్స్‌ఫర్డులో రాజకీయార్థిక శాస్త్రాలు మధించి, నాటి యూరపు దేశాలలో సాంఘిక, రాజకీయార్థిక పరిస్థితులను, సోవియట్ రష్యాలో కమ్యూనిష్టు ప్రభుత్వ పాలనను అవగాహన చేసుకొని, స్వదేశానికి వచ్చి, స్వాతంత్ర్యోద్యమములో దుమికి, ఆచార్యరంగా రైతు వ్యవసాయకూలీ, చేతివృత్తుల వారిని సంఘటితపరచి, వారి అభివృద్ధికి, కృషి చేశారు. తొలిసారిగా కేంద్ర శాసన సభలో 1935) స్వాతంత్ర్యం రాకముందు పార్లమెంటు గ్రామీణుల అభివృద్ధికి కిసాన్‌ప్లెడ్జి (Kisan plesge) పై సంత

కాలు సేకరించి, రైతురక్షణోద్యమాన్ని ఆచార్య రంగా ఆనాటినుండి సాగించారు.

కాంగ్రెసు పార్టీ భూసంస్కరణలపై 1947 లో నియమించిన కుమారప్ప కమిటీలో, రైతు, భూములతో పాటు, పట్టణాలలో, పరిశ్రమలలో, వ్యవసాయేతర వృత్తుల వారి ఆస్తులపై కూడా పరిమితులు విధించడం న్యాయసమ్మతమని కమిటీలో సభ్యులయిన రైతుబిడ్డలు శ్రీ ఓ. పి. రామస్వామిరెడ్డియారు (నాటి మద్రాసు ముఖ్యమంత్రి), ఆచార్యరంగా తమ భిన్నాభిప్రాయాన్ని (DISSENT VIEWS) లిఖిత పూర్వకంగా కమిటీ రిపోర్టులో నమోదు చేశారు. దీనితో ప్రధాని నెహ్రూ కోపంతో చిందులు త్రొక్కారు. రంగాగారు వెనుకాడ లేదు. బాహాటంగా నెహ్రూని ఎదుర్కొని తమ అభిప్రాయం ధర్మసమ్మతమని వక్కాణించారు. అయినా 1954 లో ఆవడిలో జరిగిన కాంగ్రెసు మహాసభలో సోషలిజం పేరుతో రైతుల భూములకు పరిమితి (CELING) విధించాలని నెహ్రూ తీర్మానం చేయించాడు.

1959 లో నాగపూరులో జరిగిన కాంగ్రెసు మహాసభలో సోవియట్ రష్యాను అనుకరిస్తూ, సహకార వ్యవసాయం పెట్టాలని ప్రధాని నెహ్రూ చేసిన యత్నాన్ని ఆచార్యరంగా, చౌదరీ చరణసింగ్‌లు వ్యతిరేకించి, నెహ్రూ విధానాలపై యుద్ధాన్ని ప్రకటించారు. రైతు స్వామ్య రక్షణకు ఆచార్యరంగా, చరణసింగ్ గారలు సహకార వ్యవసాయానికి వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా ఆందోళన జరిపారు. వారిపోరాటం చివరకు ఫలించింది. నెహ్రూ ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేకపోయినాడు. తరువాత వచ్చిన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి, నెహ్రూ ప్రతిపాదించిన సహకార వ్యవసాయవిధానం తప్పు అని గమనించి, దానికి స్వస్తిపలికింది. ఈవిధంగా దేశంలో రైతు స్వామ్య రక్షణకు ఆచార్యరంగా, చరణసింగ్‌గారలు చేసిన సేవ చరిత్రాత్మకమయినది. భావితరాల రైతాంగము కూడా వారికి శాశ్వతంగా కృతజ్ఞులుగా ఉండగలరు.

సోవియట్ రష్యాలో సహకార వ్యవసాయము జయప్రదము కాలేదని, కాదని, కోట్లాది రైతులను నిలువునా చంపి స్టాలిన్ రైతుల గోరీలపై నిర్మించిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు సత్ఫలితాలు ఈయలేదని రంగా గారు హెచ్చరించేవారు. కుటుంబ వ్యవస్థ, రైతుకు భూమిపై హక్కు లేనిదే వ్యవసాయం సాగదని, ఉత్పత్తి సక్రమముగా జరగదని స్టాలిన్ స్థాపించిన సమిష్టి క్షేత్రాలు నిష్ప్రయోజనము కాగలవని రంగాగారు చెప్పారు. రంగా భూస్వాముల తొత్తు అని కమ్యూనిస్టులు తీవ్రంగా దుయ్యబట్టారు. రైతులు భూస్వామిక పెట్టుబడి దారులని (కులక్‌లని), రైతు నాయకులయిన రంగా, చరణసింగ్‌లు కులక్‌ల (భూస్వాముల) ప్రతినిధులని, అభివృద్ధి నిరోధకులని, విప్లవజ్వాలలు మింగేరాక్షసులని కమ్యూనిస్టు వ్యతిరేకులని కమ్యూనిస్టులు వారిద్దరిని తూర్పారపట్టారు.

1917 విప్లవంతో రష్యాలో కమ్యూనిస్టు ప్రభుత్వము ఏర్పడింది. వ్యవసాయానికి అనువైన విశాల భూవసతి. జలసంపదగల రష్యాలో జనాభామాత్రం చాల తక్కువ. అయినా ఈడెబ్బది సంవత్సరాల కమ్యూనిస్టు పాలనలో రష్యాలో వ్యవసాయం అభివృద్ధి కాలేదు. ఉన్న తక్కువ జనాభాకు కూడా అవసరమైన ఆహారోత్పత్తి కానందున, విదేశాలనుండి ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకొనవలసిన దుస్థితి రష్యాలో ఏర్పడినది, యకరా సగటు పంటహీనంగా తగ్గింది. పొరుగుదేశాలు ముఖ్యంగా యూరపుదేశాలలోని ప్రజల జీవన ప్రమాణాలతో పోల్చుకుంటే రష్యాలో పరిస్థితి హీనమయింది. నిత్యజీవితావసర వస్తువులు అవసరమయినంతగా లభించక ప్రజలు ఇబ్బందుల పాలయినారు. చిత్తశుద్ధితో వ్యవసాయం చేసేవారు కరువయ్యారు. ట్రాక్టర్లు మున్నగు యంత్రాలు నిరుపయోగంగా మూలన పడినాయి. గ్రామాలలో నిరుత్సాహము నిరాశ ప్రబలినాయి. ప్రజలలో దైన్యస్థితి కాన

వచ్చింది. ప్రభుత్వ యంత్రాంగంతో అవినీతి పెరిగి అధికారులు దౌర్జన్యంగా అక్రమార్జనలకు దిగజారినారు. పాలకులలో నీతి, నియమాలు మాయమైనాయి. ఇటీవల ఒకలంచగొండి మంత్రి అక్రమంగా ఆర్జించిన కోట్ల విలువయిన బంగారు నాణెములను పాతరనుండి వెలికి తీసి, లోకానికి ఫొటోలతో రష్యా నాయకులు వెల్లడించారు ఇది రష్యాలో పరిస్థితి.

రష్యానాయకుడు మిఖాయిల్ గోర్బచేవ్ ప్రభుత్వ యంత్రాంగములో హద్దుమీరిన అక్రమాలను, అవినీతిని అరికట్టడానికి, ఉత్పత్తులను పెంచి, ప్రజల జీవన ప్రమాణాలను మెరుగుపరచడానికి కంకణం కట్టుకున్నాడు, సమాజ పునర్నిర్మాణానికి పెరిస్ట్రాయికా (PERISTROIKA) విధానంతో గోర్బచోవ్ నడుం గట్టాడు. వ్యక్తిస్వేచ్ఛను కల్పించి, ఆత్మవిమర్శలకు అవకాశమిచ్చి, దాపరికంలేకుండా, నిర్భయంగా ప్రభుత్వవిధానాలను పరిశీలించి, విమర్శించి, అవసరమయిన మార్పులను సూచించడానికి స్వేచ్ఛను గ్లాస్ నాస్ట్ (GLASNOST) ప్రకటించారు. పొలాలలో, ఫ్యాక్టరిలలో, ఆఫీసులలో ప్రతివ్యక్తి శక్తికొలది పనిచేసి, అధికఉత్పత్తి సాధించి, దేశసంపదను ఇతోధికంగా పెంచడానికి గ్లాస్‌నాస్ట్, పెరిస్ట్రాయికా విధానాలతో గోర్బచేవ్ మహర్షి నిర్విరామకృషి సల్పుచున్నారు. మతస్వేచ్ఛను కల్పించి, వేయిసంవత్సరాలుగా ఉన్న క్రైస్తవ సంస్థలకు సంపూర్ణ స్వేచ్ఛను ప్రసాదించి మతసామరస్యాన్ని పెంపొందించి, ప్రజల ఆదరణను, అభిమానాన్ని విశాల హృదయుడయిన గోర్బచేవ్ చూరగొంటున్నాడు. సమిష్టి క్షేత్రాలను మార్చి, రైతు కుటుంబాలకు భూములను కాంట్రాక్టు పద్ధతిపై ఇచ్చి వ్యవసాయాన్ని అభివృద్ధిచేసి, నాలుగురెట్లు అధికోత్పత్తిని సాధించవచ్చని ప్రయోగాలద్వారా గోర్బచేవ్ నిరూపించాడు. లాభదృష్టితో, స్వప్రయోజన దృక్పథంతో రైతాంగము శ్రమించి, గోర్‌బచోవ్ విధానం ప్రకారం అధికోత్పత్తిని సాధిస్తున్నారు. అల్లే ఫాక్టరీలలో కూడా లాభనష్టాలకు బేరీజువేసుకొని, నడిపి లాభము తీయాలనే ప్రతిపాదనను గోర్బచేవ్ చేస్తున్నాడు. అందుకే రష్యన్ ప్రజలు గోర్బచేవ్‌కు బ్రహ్మరథం పడుతున్నారు, తూర్పు యూరపు దేశాలలో కూడా గోర్‌బచోవ్ ప్రభావం కనబడుతున్నది.

నిరంకుశ స్టాలిన్ పరిపాలనలో వచ్చిన దుష్పరిణామాలు అంతరించి, కమ్యూనిస్టు వ్యవస్థలో మానవతావిలువలు నెలకొనగల సుదినములు రాకతప్పవని ఏనాడో శ్రీ యం.యన్.రామ్ చెప్పిన జోస్యము గోర్బచేవ్ ఉద్యమం ద్వారా ప్రస్ఫుటమవుతున్నది. వ్యక్తిస్వేచ్ఛ, కుటుంబవ్యవస్థ, స్వంతఆస్తి, రైతుస్వామ్యము లేకుండా ప్రజాస్వామ్యము మనజాలదని, దేశసంపద పెరగదని, ప్రజల జీవన ప్రమాణాలు అభివృద్ధికావని, నాటిస్టాలిన్ పాలనను గూర్చి, రంగాగారు వెల్లడించిన అభిప్రాయములు వాస్తవమని నేటి గోర్బచేవ్ ఉద్యమం ప్రబల నిదర్శనము.

రష్యాలో ఇతర కమ్యూనిస్టు దేశాలలో రైతులకు జరుగుచున్న అన్యాయాన్ని అంతర్జాతీయ రైతు సంఘము స్థాపించి "ప్రపంచ రైతులారా ఏకంకండి" నినాదం అందించి, ఆచార్య రంగా రైతాంగ రక్షణకు మహత్తర సేవ చేశారు. ప్రపంచ రైతాంగ చరిత్రలో ఆచార్య రంగా ఆచంద్ర తారార్కముగా మనగల ధన్యజీవి. రాజకీయ స్థిరభావములు, సేవాభావము, నైతిక విలువలు, ప్రజాభిమానము గల ఆచార్య రంగాలాంటి దేశాభిమానులు రష్యా నాయకుడు గోర్బచేవ్ కృషిని హర్షించి ఆమోదించి, అభినందించ గలరు. గోర్బచేవ్ చేనున్న మహత్తర సాంఘిక విప్లవము ప్రపంచదృష్టిని ఆకర్షించింది. శ్రీ యం, యన్, రాయ్, ఆచార్య రంగాలాంటి ప్రజాస్వామ్యవాదుల కలలు నిజముకావడం శుభకరం.

నేటి ప్రజా జీవితంలో ఆచార్య రంగాలాంటి దేశభక్తులు, నిష్కామ సేవకులు అరుదు. దబ్బు.

అధికారం సంపాదించడానికి కొట్లాడుకొనే క్రొత్త రాజకీయ వర్గం పుట్టుకొచ్చింది. కాంట్రాక్టర్లు, సినిమా నటకులు, సారా వ్యాపారస్థులు, హోటలు యజమానులు, పత్రికాధిపతులు అడ్డదారులు తొక్కి అక్రమాలతో కేవలం ధనార్జనకు రాజకీయాల ముసుగులో దోపిడీ దొంగలు తయారయారు. రంగా గారికి యీ దోపిడీదార్లకు హస్తి, మశకాంతరము తేడా వున్నది. ఠీవిగా, నైతిక ధైర్యముతో, సేవాతత్పరతతో ప్రజాసేవలో ఆదర్శంగా మనగలిగిన త్యాగధనులు రంగాగారు. క్రొత్త నాయకులు, కొందరు ఆరితేరిన పాత నాయకులు బెల్లంమీద ఈగల్లాగా ముసురు కుంటున్నారు. మంచిని గమనించి, హర్షించి, ప్రోత్సహించవలసిన ప్రజలే విచక్షణాజ్ఞానం కోల్పోయి, స్వధర్మము మరచి, ముదిరిన పిచ్చితో నిజాయితీపరుల, సౌజన్యులను రాజకీయరంగంలో నిలబడలేకుండా చేయడము దురదృష్టకర పరిణామం.

నెహ్రూ ప్రభుత్వ రైతు వ్యతిరేక విధానాలతో ఏకీభవించ లేకనే ఆచార్య రంగా తొలుత కాంగ్రెసు నుండి బయటకు రావలసి వచ్చినది. దేశవ్యాప్తంగా బలవత్తరమైన కాంగ్రెసును బయటనుండి ఢీకొన గలిగిన రంగాగారి ధైర్య సాహసములు అపూర్వము. "నా రాజకీయ భవిష్యత్తు ఏమిటి" అని కాంగ్రెసునుండి బయటకు పోవునప్పుడు రంగాగారు ప్రశ్నించుకొనలేదు. తన స్వార్థమే ఆలోచించుకొన గలిగితే రంగాగారు నెహ్రూతో సఖ్యత నెరపి, అవసరమయిన పదవులను సునాయాసంగా అధిష్టించ గలిగే వారు. రాజకీయార్థిక శాస్త్రములలో నిష్ణాతులు, అపారమయిన జ్ఞానసంపద, ఆంజనేయుడిలాంటి అద్భుతశక్తి, నిశిత వాక్పటిమ, పార్లమెంటులో వాదనా నైపుణ్యము, అన్నిటికి మించి శ్రీరామచంద్రుని పోలిన నైతికశక్తి గల సద్గుణముల రాశి రంగాగారు. కాని తాను నమ్మినదానికి కట్టుబడి, కాంగ్రెసును వీడి మొదట కృషికార్ లోక్ పార్టీ, తరువాత రాజాజీతో కలసి స్వతంత్ర పార్టీ దేశవ్యాప్తంగా నిర్మించి, నడపడంలో రంగాగారి ప్రత్యేకత అద్వితీయం. స్వప్రయోజనం కొరకు ఏనాడు రంగాగారు పార్టీ మార్చలేదనునది నిర్వివాదాంశం. అయితే ఆజ్ఞలు అపార్థం చేసుకొనడం, రాజకీయ శత్రువులు ఏవో కారణాలు అంటగట్టడం అనుచితమే.

1971లో తిరిగి రంగాగారు కాంగ్రెసులో ప్రవేశించడం దురదృష్టకరం. సహకార వ్యవసాయ ప్రతిపాదనను వదలి, రైతుస్వామ్య రక్షణకు, గ్రామీణ ఆర్థికాభివృద్ధికి శ్రీమతి ఇందిరాగాంధి సిద్ధపడినందు వలననే తాను కాంగ్రెసులో చేరాను అని రంగాగారు సమర్థించుకొన వచ్చును. కాని ఇందిరాగాంధి ఎమర్జెన్సీ ప్రకటించి ప్రతిపక్ష నాయకులను జైళ్ళలో తోసి, పత్రికల నోళ్ళు నొక్కిననాడు రంగాగారి మౌనము వహించడం విచారకరం.

నెహ్రూ, ఇందిరా ప్రభుత్వములలో వివిధ పదవులను అనుభవించిన అనేకమంది కాంగ్రెసువారే తిరిగి అధికారంలోకి రావటం మొదటనుండి నెహ్రూను ఎదుర్కొని కాంగ్రెసును వీడిపోయిన రంగాగారు 1977 లో వచ్చిన జనతా ప్రభుత్వమునకు కూడా దూరము కావడం అత్యంత విషాదకరం. "ఇన్నాళ్ళుగా కాంగ్రెసుతో పోరాడిన రంగాగారు ఇప్పుడు కాంగ్రెసులో ఇరుక్కొని పదవి దూరము కావడం బాధాకరం" అని 1977లో ఆచార్య కృపలానీ ఆవేదన చెందారు. రంగాగారు ఎంతో దురదృష్టవంతులని వేరుగా చెప్పుకోనవసరం లేదు. జనతాలోనే ఉంటే ప్రధానిగానో, రాష్ట్రపతిగానో రంగాగారు దేశానికి సేవలందించేవారు. కాని విధి బలీయమైనది గదా!

జనతా హయాంలో కాంగ్రెసులో ఇరుక్కుపోయిన భీష్ముడు రంగాగారు. కౌరవసైన్యంలో వున్న పాండవ పక్షపాతి అయిన "భీష్మాచార్యుని" వలె ఆచార్య రంగా కాంగ్రెసులో వున్నారు. జనతాపాలన రంగాగారికి తృప్తి కలిగించగలదని ఊహించబడినది. "జనతా ప్రభుత్వం ఎక్కువకాలం మనజాలదు, అని రంగాగారు ఊహించినట్లే కొందరు నాయకుల దురాలోచన ఫలితంగా జనతా పతనంకాక తప్పలేదు.

రాజీవ్ గాంధీ నాయకత్వమున కాంగ్రెసు ప్రభుత్వము రోజురోజుకు ప్రజలకు దూరమగుచున్నది. ప్రజాశక్తి విజృంభించి రానున్న ఎన్నికలలో కాంగ్రెసును త్రోసివేయగలదని రాజకీయజ్ఞుల ఊహ. ప్రజాస్వామ్యప్రియులు, ప్రజాసేవలో పండిపోయిన రంగాగారు రాజీవ్ ప్రభుత్వ పాలనతో తృప్తి చెందడం ఆమోద యోగ్యము కానేరదు. కాని వ్యక్తిగతంగా రంగాగారిని ఎవరు వేలెత్తి చూపలేరు. కాంగ్రెసులో ఉన్న మేరుపర్వతంలా రంగాగారి ప్రత్యేకత, నైతిక బలము, ధర్మదృష్టి, ప్రజాభిమానము అసమానము, మహోన్నతము, పార్టీలకు అతీతంగా, సమస్యల మంచి చెడుల మీద పార్లమెంటులో మాట్లాడడం ఆయన ప్రత్యేకత. కాని రంగాగారిని కాంగ్రెసు సముచితంగా గౌరవించు కొనలేక పోవడము విచారకరం. నేటికి కాంగ్రెసేతర పార్టీలు, పెద్దలు ప్రజలు రంగాగారిని పూజ్య భావంతో చూడడం ఆయన వ్యక్తిగత నైతిక విజయమే. పదవులు లేకపోయినా చరిత్రలో రంగాగారి స్థానం పదిలం.

సహధర్మచారిణి, భారతీదేవిగారు గతించినా, 88 సంవత్సరాలు నిండినా, దేశసేవా కార్యక్రమాలలో తరగని ఉత్సాహముతో పాల్గొనడం గర్వకారణం. ప్రపంచ రైతాంగమునకు మరువరాని మహనీయుడు, మహాత్ముడు రంగాగారు. వారి 89వ జన్మదినోత్సవ సందర్భమున వారికి ఆరోగ్య భాగ్యమును ఆశీర్వదించాలని భగవంతుని ప్రార్థిస్తూ, ఇంకా యువకునివలె పరుగులు తీస్తున్న రంగాగారిని అభినందిస్తున్నా.

— ...

'క్షేత్రలక్ష్మి' కవిబ్రహ్మ ఏటుకూరి

కలముం బట్టుము విశ్వమానవ కళాకాంతుల్ ప్రదర్శింపగా
హలముం బట్టుము లోక జీవన సమస్యా స్ఫూర్తి రేకెత్తగా
నిలువుం గోతను సమ్మతించి జతమై నిద్రించు దుర్జాతితో
చలక్రిందై తప మాచరింపు మపుడే ధన్యంబు నీ జన్మమున్.

అందని దివ్య భూముల కహర్నిశ మిట్టెగబ్రాకు చుందు వీ
వెందులకోయి! నందనములేల? యసంగత దేవతా ప్సరో
బృదము లేల? చందనము లేల? మరందము లేల? జీవికా
నంద మొనర్చు రైతు భజనమ్మున నీకృతి నింపగూడదా?

# సుమంగళి - భారతి

— చిన్నము రామయ్య చౌదరి

1) కుంకుమ బొట్టుతో, సవురు గూర్చెడి ఖద్దరు చీరతోడ, దీ
కాంక్షిత దేశభక్తియె త్వదాకృతి గన్నది యన్నభాతి, క్షే
మం కరియైన మా భరతమాతవుగాఁ గనిపింతు వమ్మ! స్మృ
త్యంకము మా కిఁకేమి కలదమ్మ! దివమ్మున కీవు చేరగా ?

2) చామనచాయతో మిసమిసల్ పచరించెడి మేనితీవతో
కోమలమైన పెన్నెఱుల క్రొమ్ముడితో, చిఱునవ్వు పూలతో,
ఆమనితోట వౌచు పతికబ్బుట నాతడు రైతు బాంధవుడై
మహిమం గనెన్; విధురుడై యిఁకనెట్లు భరించునో వ్యథల్!

3) గోసదనమ్మ శోకముల కుంపటి యయ్యెను, నీ వియోగ సం
త్రాసము కాఱు చీఁకటుల రాసులు వోసె, ప్రజా శిరస్సులన్
భాసిలు దేశ మాతృ పద పద్మములం బొక అర్చనాసుమం
బై, సరిలేని సౌరభ గుణాళిని జిమ్మెడి నీవు పోయినన్!

4) ఆనలు రేపి భవ్య కవితామృతధారలు జాలువాఱఁగా
జేసెదు! ప్రోత్సహించెదవు, శీర్షమునన్ ధరియించి సత్కవిన్;
భాసిత మైన నీ హృదయ పద్మములోని దయామరంద ధా
రాసవమిచ్చి ప్రోతువు గదమ్మ! ఇకెవ్వరు దిక్కు వానికిన్.

5) నీ రమణీయ భావనలు నిర్మలమై ప్రవహించు వాహినీ
పూరములై తెలుంగు ధర పొంగగ పర్వులు వాఱెనద్దెసల్
కోఱలు నూఱి మృత్యువను కోల్పులి నీ హృదయమ్ము చీల్చెనా?
మారణ హోమముల్ మణుల మాలలుగా విధిదాల్చు చేటొకో!

# ఆచార్య రంగా
# రెండు తరాలకు వారధి-
# విజ్ఞానధన నీరధి-
# దేశహితైక రథ సారథి.

శ్రీ తుర్లపాటి కుటుంబరావు
జర్నలిస్టు

నిమ్మబోలులో వున్నా, న్యూయార్కులో వున్నా ఆచార్యరంగా "రైతురంగా" యేనని ఎవరో అన్న మాట అక్షరాల నిజం.

ఆంధ్ర రాజకీయవేత్తలలో ఆచార్య రంగాది ఒక విలక్షణమైన స్థానం. పోరాటం ఆయనకు ప్రాణం! ఆందోళన ఆయనకు ఊపిరి.

అర్థశతాబ్దికి పైబడిన ఆయన రాజకీయ జీవితాన్ని పరిశీలిస్తే, అది ఆందోళనల మయం. అది నిరంతర ఉద్యమాల సంభరితం.

అయితే! ఆయన ఆందోళన అధికారం కోసం కాదు! ఆయన పోరాటం పదవుల కోసం కాదు.

ఎక్కడైనా రైతు ఉద్యమాలు జరిగితే, అక్కడ ఆయన ప్రత్యక్షమౌతారు. కూలీలు, తమ కోర్కెల కోసం ఆందోళనచేస్తుంటే, ఆయన అక్కడే ఉంటారు. ఇంకా ఏ వృత్తులవారు ఎందుకోసం ఆందోళన చేసినా, ఆయన సహకరిస్తారు.

అందువల్లనే ఒకసారి లోక్‌సభలో "ఆచార్య రంగా సభలో ఉండగా, భారత రైతాంగానికి ఏమి కొదువ?" అని ప్రధాని నెహ్రూ అన్నారు.

రైతుల సంక్షేమానికి విరుద్ధమైన విధానాలను కాంగ్రెసు అవలంభిస్తున్నట్లు తాను భావించినప్పుడు నెహ్రూజీనైనా ఎదుర్కొనడానికి, విమర్శించడానికి ఆయన వెనుదీయలేదు.

1957 వ సంవత్సరములో ఎల్వాల్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశములో సహకార వ్యవసాయ విధానాన్ని ప్రవేశపెట్టాలని నిర్ణయం జరిగిన సందర్భంలో దాన్ని ఆచార్యరంగా వ్యతిరేకించారు. కేవలం గ్రామీణ ప్రాంతాల వ్యవసాయ భూములపై మాత్రమే సీలింగ్ పెట్టి, పట్టణ ప్రాంతాలను ఈ సీలింగ్ నుంచి మినహాయిస్తే గ్రామీణ, పట్టణ ప్రాంతాల మధ్య అంతరం పెరిగిపోయి, ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నం కాగలదని హెచ్చరిస్తూ శ్రీ జవహర్‌లాల్‌ను ప్రతిఘటించారు శ్రీ రంగా. ప్రతిఘటించడమేకాదు, కాంగ్రెస్ నుంచి నిర్గమించారు. కేవలం నిర్గమించి ఊరుకోకుండా ఆ విధానాన్ని ఎదుర్కొనడానికి రెండు సంవత్సరాలు దేశ వ్యాప్తంగా పర్యటించి రాజాజీతో కలిసి 1959 లో స్వతంత్రపార్టీని స్థాపించారు.

ఆయన ఎన్ని పార్టీలు స్థాపించినా, ఇప్పటి చాలా మంది రాజకీయవేత్తలవలె అవి పదవుల కోసం కాదు. ఆ సిద్ధాంతం ఏమిటో అందరికీ తెలిసిందే. అదే రైతు కూలీ ప్రజారాజ్య నిర్మాణం.

## గాంధీజీతో చర్చలు :

ఈ సిద్ధాంతం కోసమే ఆచార్యరంగా తన యావ జ్జీవితాన్ని అంకితం చేశారు. 1945 లో గాంధీజీతో సుదీర్ఘమైన చర్చలు జరిపి, కాంగ్రెసుకూడా ఈ సిద్ధాంతాన్ని ఆమోదించేటట్టు ఆయన చేయగలిగారు.

అంతేకాదు, 1945 లో వయోజన ఓటింగ్ హక్కు సూత్రానికి సయితం గాంధీజీచేక ఆయన ఒప్పించారు.

దేశానికి వెన్నెముక రైతు. రైతులేనిదే రాజ్యమేలేదు. అలా అని అందరు అనటమేకాని, తమ అవసరం వచ్చినప్పుడు వాడుకున్న వారందరు అతడిని అలక్ష్యం చేస్తున్నారని ఆయన ఆందోళన, ఆవేదన. అందువల్లనే, ఆయన 1935 లో అఖిల భారత రైతు సంఘాన్ని స్థాపించారు. రైతాంగంలో చైతన్యం కలిగించడానికి ఎన్నో రైతు యాత్రలు, రైతు ఉద్యమాలు, సత్యాగ్రహాలు నడిపారు.

ఆచార్య రంగా తన రైతాంగ అభ్యున్నతి సాధన కృషిని, వారిలో చైతన్య ప్రదీప్తి కృషిని ఇండియాకే పరిమితం చేయలేదు. అంతర్జాతీయ రంగానికి సయితం దాన్ని విస్తరింపజేశారు. 1946 లో లండన్‌లో అంతర్జాతీయ వ్యవసాయ ఉత్పత్తిదార్ల సమాఖ్యను ఆయన నెలకొల్పారు. పెక్కు అంతర్జాతీయ రైతు మహాసభలలో ఆయన పాల్గొన్నారు.

అంతేకాదు - చేతివృత్తుల వారిలో చైతన్యం రావాలెనని ఆయన అఖిల భారత చేనేత కాంగ్రెస్‌ను స్థాపించారు.

గ్రామీణ ప్రజలలో చైతన్యవ్యాప్తికి గ్రామీణ ప్రజల సమాఖ్యను నెలకొల్పారు. ఆయా వృత్తులవారికి వేర్వేరు సంఘాలు ఉండవలెనని, అప్పుడే వారు తమ తమ రంగాల సమస్యలను సమర్థంగా పరిష్కరించుకోగలరని ఆయన అభిప్రాయం.

## బహు గ్రంథకర్త

ఆచార్య రంగా బహు గ్రంథకర్త. తన ఆశయ లక్ష్యాలను వివరిస్తూ ఆయన అనేక గ్రంథాలు వ్రాశారు. వీటిలో హెచ్చు గ్రంథాలు రైతుల సమస్యల పైన అని వేరే చెప్పనక్కరలేదు.

జమీందారీ విధానాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు 1937లో ఆయన "వాహిని" అనే తెలుగు వారపత్రికను నెలకొల్పారు. దాన్ని ఆనాడు శ్రీ నెహ్రూజీ ప్రారంభించారు.

నిజానికి సుదీర్ఘమైన ఆయన జాతీయ అంతర్జాతీయ రాజకీయ జీవిత స్థాయితో పోల్చితే ఆయన ఏనాడో ముఖ్యమంత్రి, అంతకంటే ఎక్కువ ఉన్నత పదవులను అధిరోహించవలసినవారు.

అయితే అది ఎందువలన జరగ లేదు? ముందే చెప్పినట్లు ఆయనకు పదవీ కాంక్ష లేదు. అదే వుంటే ఆయన ఎన్నో ఉన్నత పదవులను అధిష్టించి వుండేవారే.

## ఆర్థికశాస్త్ర అధ్యాపకుడు

ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో ఆర్థికశాస్త్రంలో ఉన్నత డిగ్రీ తీసుకున్న ఆచార్య రంగా మద్రాసు పచ్చయప్ప కాలేజిలో ఆర్థికశాస్త్ర అధ్యాపకుడుగా పని చేస్తూ 1930లో రాజీనామా చేసి స్వాతంత్ర్యోద్యమ రంగంలో చేరారు.

## రైతాంగ విద్యాలయం

రైతులలో, రాజకీయవాదులలో రాజకీయ విజ్ఞాన ప్రచారానికి స్వగ్రామమైన నిడుబ్రోలులో "రైతాంగ విద్యాలయాన్ని" ఆయన నెలకొల్పారు. దీనికి మహాత్మా గాంధీ ప్రారంభోత్సవం చేశారు. ఇందులో నేటి ఆంధ్ర రాజకీయ ప్రముఖులెందరో సుశిక్షితులయినారు. వారు ఇప్పుడు ఏ పార్టీలోవున్నా ఇప్పటికి ఆయనను గురు భావంతో గౌరవిస్తారు.

ఆయన పుట్టినరోజు అయిన నవంబరు 7వ తేదీ రైతుల దినోత్సవంగా జరపాలని రాష్ట్రప్రభుత్వం నిర్ణయించడం సముచితంగా వున్నది. 89వ సంవత్సరము వచ్చినా రైతుకూలీల సమస్యగురించే వారి తపన.

50 సంవత్సరాల పార్లమెంటరీ జీవితముగడిపిన శ్రీ రంగాకు నేడు చిలుమూరులో బ్రహ్మాండమైన అభినందన సభ జరగడం ముదావహం. ఈ కార్యక్రమానికి ఉద్యమించినవారు బహుధా అభినందనీయులు.

# పాండవ మధ్య - వెంకటప్పయ్య
# రైతాంగ విద్యాలయ భజన - ఉపాసకులు

రచన : శ్రీ ఆచార్య రంగా

ప్రతి పొద్దుట, సాయంత్రము, ఆ చిన్నదైన చక్కని తటాకమునకు రోడ్డునకు దక్షిణమునవున్న విద్యాలయమందు ఆయన్ని చూడగలరు. అంటొక బెంచీ మీద కూర్చుంటారు. వచ్చినవారిని మందహాసముతో ఆహ్వానిస్తారు. ఎదురుగావున్న బెంచీలమీద కూర్చో మంటారు. వారు కోరుతున్న సలహాలను అందిస్తారు. తనకుతోచిన ఆలోచనలను ఆనాటి ఆ సమయాన ప్రజా సమస్యలు, వార్తలపై నిర్భయంగా, నిరాఘాటంగా తన 60 సం॥ల ప్రజాహితైక జీవితపు మధువుతోజేర్చి తన ఆలోచనలు ప్రకటిస్తూ ఉంటారు.

ఆ విద్యాలయ ఆవరణలో 1933 నుండి వేల కొలదిగా ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, ఒరిస్సా ప్రాంతాల నుండి వస్తున్న వయోజనులు, విద్యార్థులు, పండితులు ప్రజానాయకులను ఆహ్వానిస్తూ, పలుకరిస్తూ సరస సల్లాపములతో రాజకీయ, సాంఘిక సమస్యలను స్పృశిస్తూ వస్తున్నారు.

ఎందరినో చూచనారు. మహాత్మా గాంధీజీయే పలుమార్లు ఆ విద్యాలయమును చూస్తూ వస్తూ పోతూ ఉండిరి. జవహర్ ఆ దారిననే సాగిరి.

ఆ గిరి, ఈ సాధు స్వామి సీతారాం, ఆ ప్రకాశం, ఈ దేశభక్త వెంకటప్పయ్య, ఆ స్వామి సహజానందా, ఇందూలాల్ యాగ్నిక్, విప్లవాగ్ని జ్యోతులు. దివిటీలు. సంస్కరణలను, అభివృద్ధి సార ధులను, కవులను, గాయకులను, యజ్ఞాలు సాగించిన వారిని, తపోధనులను, దేశీయ, విదేశీయ, మహానాయ కుల నెందరినో పిల్చిరి, పల్కరించిరి, కలిసిరి ఆయన. ఆయన సోదరులు పండితులైన విద్యాలయ స్థాపకా చార్యులు లక్ష్మీనారాయణ. దశాబ్దాలలో! ఆయనే శ్రీ వెంకటప్పయ్య.

తాను, తన సోదరులు లక్ష్మీనారాయణ నన్ను పెద్ద ఆచార్యులుగా గుర్తించుకొనిరి, అదే నాకు స్వతః సిద్ధముగా, దీర్ఘకాలికముగా, దైవదత్తము లాంటి, ధనము, అధికారం. ఎన్నికలు అభిమానాలతో నిమిత్తం లేని, కాలనిర్ణయంలేని ఆచార్య సౌభాగ్యం. ప్రజాసేవ లకు సరస్వతీదేవి ఔపాసనకు, విద్యాదానమునకు అవ ధులులేని అవకాశము కల్పించిరి. ఆయన, తమ్ములు లక్ష్మీనారాయణ.

మా ముగ్గురిలో దేహసౌష్టత కల్గినవారు విశ్వ విద్యాలయ ధోరణిలో వారికి మాకందిన బిరుదులు అంద లేదు. వ్యవహార జ్ఞానంలో గ్రామీణ ప్రజా వ్యవహార నిర్వహణలో వారిదే పెద్ద డిగ్రీ. పై పెద్దగా నన్ను చిన్నారి వ్యవహర్తగా లక్ష్మీనారాయణను, పైకి కన్పిం చని ప్రేమతో అంతెరుగని గంభీరమగు పట్టుదలతో, గోముగా మమ్మిద్దరిని ఆదరించిరి, అనుసరించిరి, కను మెలిగి రక్షిస్తూ, పోషిస్తూ వస్తున్నారు.

రైతాంగ విద్యాలయ తరగతులు ప్రతి సం॥ జరుపుతూ ఉండేవారం. ఆ 1933 - 1959 వరకు.

మేము జైళ్ళలో (1932, 1933, 1940-44) వుంటూ ఉన్నప్పుడు, బహిరంగంగా కొందరు, రహస్యంగా మరికొందరు, పాత ఆశ్రితులు క్రొత్త విప్లవకారులు వస్తుండేవారు. ఆ బ్రిటిషు పాలనా వత్సరాలలో వారికి భోజనాలు, వసతులు, ఆశ్రిత మర్యాదలు శ్రీమతి భారతీ దేవి అందించేవారు. వారికి మా రాచకీయ ధోరణుల వివరించటం, పరస్పరంగా చర్చించుకోవటం, కార్య క్రమాలు సరిదిద్దుకోవటంతో, లక్ష్మీ నా రా య ణ, వెంకటప్పయ్య తోడునీడలు.

సర్దార్ పటేల్, రాజాజీ ప్రభుతులకు బోసుబాబు హింసాత్మక విప్లవ ధోరణి గిట్టదు. వారి మాటలకీ మహాత్ములవద్ద విలువ. వీరందరి పరస్పర వ్యతిరేక ధోరణులమధ్య నేను సతమతమవుతూ ఉండుట ఆనాటి నా అనుభవము

తన్నెన్నోమారులు ప్రభుత్వం జైలుకు పంప ప్రయత్నించిరి. కలక్టర్లు తటస్థ పడుచున్నప్పుడు మా అన్నయ్య, తమ్ములు, చెల్లెళ్ళను జైలులో ఉంచుకొంటు న్నారే. నన్ను కూడా జైలుకు రమ్మంటే తయారే, అయితే నేనుకూడా జైలులో ఉంటేతప్ప, మీ ప్రభుత్వం బ్రతకలేదా? అంతటి నిర్వీర్యులు మీరెలాగ ప్రభు త్వాన్ని సాగిస్తారు అంటూ ఉండేవారుట! అలాంటి సరసమగు సాహసిజోలికి ఆనాటి ప్రభుత్వం పోజాల కుండెనట.

వచ్చింది స్వరాజ్యం. ఆహ్వానించింది నన్ను రాష్ట్ర కాంగ్రెసు తన అధ్యక్ష పదవికి. నడిపితిని ఆ గురుతరమైన బాధ్యతను 5 సం॥లు. ఆ సుదీర్ఘమగు అధికార పర్వదినాలలో మా సోదరులకు ఆశ్రిత మేనల్లుడు ఆచంటి శేషయ్య అందించిన సహకార సంపత్తి ప్రతిఫలరహితమైనది.

కమ్యూనిస్టుల హింసాత్మక చర్యలు, ఆనాటి కాంగ్రెసు ప్రభుత్వాన్ని, రైతాంగాన్ని కలవరపరుస్తు న్నపుడు మాకు "జాగ్రత్త, చంపుతాం" అనే సవాళ్ళు పదేపదే వస్తున్నపుడు, లక్ష్మీనారాయణ నాటు, ప్రక్క తోడుగా శేషయ్యతో కలిసి తానుంటూ ఉండిరి. కృష్ణలో గొర్రెపాటి, కాకానివలెనే, మృత్యుదేవత సవాలును ఎదిరిస్తున్న వీరులు.

ఆ మధ్యలో, కాంగ్రెసువారు మంత్రివర్గాన్ని ఏర్పరచుకున్నప్పుడు అఖిలాంధ్ర రైతురక్షణ యాత్ర కీర్తిశేషులు కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి నాయ కత్వంద్వారా సాగినది. గుంటూరుజిల్లా కంతటా నాయకత్వ బాధ్యత వెంకటప్పయ్య శిరసావహించిరి. స్వర్గీయ వాసిరెడ్డి వెంకయ్య, కావూరి వెంకయ్య, లావు అంకమ్మ, వజ్రాల వెంకటరెడ్డి, శ్రీ గురవారెడ్డి ప్రభు తుల సహకారము పొందిరి. జిల్లా రైతాంగమును మేల్కొలుపుటలో గొప్ప విజయం సాధించిరి.

ఆ 1930-1950 మధ్య వ్యవసాయ కూలీలను, హరిజనులను ఉద్ధరించటానికై గ్రామ వ్యవహారాలలో నిలబడటం కత్తిమీద సామేకదా .ఒక సం॥రము లక్ష్మీ నారాయణగారి గడ్డివాములు తగలబెట్టినారంట పంచా యితీ పెత్తందారుల స్నేహితులు, మరి కొన్ని సం॥రాల పిమ్మట సోదరుల చెరకుతోట కోయించేసినారంట. అయినా వారేమో తొణకలేదు పోలీసులకు ఫిర్యాదు చేయలేదు ధైర్యముగా నిల్చిరి. కూలీలనే రక్షిస్తూ ఉండిరి. వారి తల్లి మంగమ్మగారు, ఎవ్వరిని ఏ మాట అనకుండా, అట్టి అగ్ని పరీక్షల్లో నిల్చునట్లు ప్రభోదిం చిరి. అట్లే ఐదుగురు హరిజన సోదరులమీద నాల్గు సంవత్సరాల పర్యంతం కోర్టులలో కేసులు ఎదురు పక్షమువారు నడిపిస్తే విజయం సాధించిరి. కనుకనే దశాబ్దాలపర్యంతం కూలీలు, హరిజనులు వెంకటప్ప య్యనే తమ నాయకులుగా గౌరవిస్తూ ఉన్నారు. 60, 50 సంవత్సరాల క్రితం హరిజనులను మానవ మాత్రు లుగా చూచుకోవడం కనీస ధర్మమని మహాత్ముడు చెప్పినపుడు బస్తీ కాంగ్రెస్ పెద్దలే అంటరానితనాన్ని సంఘ మర్యాదలలో తొలగించుటకు వెనుకాడుచుండిరే! దూరాన శతాబ్దాల తరబడి పూర్వాచారాలలో బందీలై

ఉండిన పై కులాలవారు ఆర్థికంగా, సాంఘికంగా లోబడ్డ అన్ని విధాల దోపిడీలకు దీనులై లోబడుచూ సమాన సోదర మానవులుగా ఉండిన హరిజనులను, దగ్గర తీసుకోవడానికి, రైతులలోని పై కులాలవారు సాహసించుట దురూహ్యముగా ఉండేది. ఆ పరిస్థితులలో నేను చెప్పటం, నా తమ్ముల్లు ముగ్గురు (న॥ వెంకటసుబ్బయ్యతోసహా) అనుసరించటం, భారతీదేవి చెల్లెళ్ళిద్దరూ సరేననటం, రామ్మోహనరాయ, వివేకానంద, గాంధీజీ ఆదేశం ప్రకారం అంటరానితనాన్ని ఎదురించటం, 1923లోనే ప్రారంభిస్తే గ్రామములో మాకు పంచాయితీ ప్రముఖత్వం అందుతుందా? కుల బహిష్కరణ అప్పుడుగదా? ఆ పైన, హరిజనవాడలోకే వెళ్ళి పంచములతో కలిసి, వంటలు వండించుటా? అందరం కలిసి భోజనాలు చేయడమా! ఎంత సాహసం!

అదీ చాలదని మా ఎలిమెంటరీ పాఠశాలకు ఒక హరిజన పంతులును హెడ్ మాస్టరుగా వేయించుకొంటిమి. ఆయనకు మా పల్లెలో సుఖమైన ఇల్లేది? వారికి మా నాన్నగారి కుండిన, రెండో ఇల్లును (యిప్పుడు లక్ష్మీనారాయణ ఉండిన ఆ స్థలంలోని నాగా గార్డెన్స్) ను వారికి అందిస్తిమి. గ్రామములో అంతవరకు ఒక ఇల్లు హరిజనులకు ఇవ్వడం అదే ప్రథమ సాహసం. ఎందరికో అందువల్ల అసంతృప్తే! అన్ని అట్టి సాహసమగు సంఘ, సంస్కార కార్యములు సాధించుటకు అవకాశం, వత్తాసు సంఘ తోడ్పాటు మా దంపతులకు కల్గించు చుండినది శ్రీ వెంకటప్పయ్యే. కనుకనే ఆయనకు మా ఊరిలో ఒంటరి తనమే! పంచాయితీలో బలహీనతే! అంతటి త్యాగం వారిది.

ఆ అయిదేళ్ల కాంగ్రెస్ పెత్తనంలో వెంకటప్పయ్య కోరుకుని సాగించిన ప్రత్యేక బాధ్యత, ఆంధ్ర వ్యవసాయకూలీ కాంగ్రెస్. దాని కార్యనిర్వాహక సభ్యత్వం! దానికి కీర్తిశేషులు బి.యస్. మూర్తిని అధ్యక్షులుగా, కార్యదర్శిగా శ్రీ అంజనప్పను (మాజీ M.P.) నిలుపుకొనిరి. ఆ ప్రత్యేక బాధ్యత తానై అందుకున్నందుకు కారణం 20 సం॥రాల పర్యంతం మా ప్రాంతాలలో ప్రత్యేకంగా మా స్వగ్రామం నిడుబ్రోలులో వ్యవసాయ కూలీలలో అత్యధిక సంఖ్యాకులగు మా హరిజన బృందాలను ప్రేమించి, సేవించి, రక్షించుచుండే అనుభవమే.

పంచాయితీ పెత్తనాలలో మా గ్రామ హరిజనులెప్పుగా వెంకటప్పయ్యనే నాయకునిగా గౌరవించిరి. వారికై మా మామయ్య కీ॥శే రామస్వామి నిర్మించిన మంచినీటి బావిని (గోభూమి వద్ద) మా నాన్న నిర్మించిన మరొక బావిని హరిజనులకు 1923లోనే అంటరానితనాన్ని ఎదిరిస్తూ వారికి అర్పించితిమి. మిగతా కులాలవారు హెచ్చుగా ఆ బావులను బహిష్కరిస్తూవుంటే లెక్కచేయక నా ప్రక్క నిలబడిరి ఆనాటి మున్సిఫ్‌గా వుండిన ఈ వెంకటప్పయ్య ధార్మికమైన కూలి, ఇంటి పశువుకు అవసరమగు గడ్డి, జనపకట్టి, సంక్రాంతి మర్యాదగా కళ్ళములోని ధాన్యం నిరుద్యోగ కాలంలో వడ్డీలేని పరపతికి అందించేవారు.

నిడుబ్రోలులో ఉన్న నాయీ బ్రాహ్మణులు (మంగలివారు) మధ్య నైతిక విలువలు, భగవద్భక్తి కలిగిన పెద్ద శ్రీ వెంకటప్పయ్యగారు, చోళకులోత్తుంగ చక్రవర్తిచే ప్రతిష్ఠాపించబడిన శివాలయ పునరుద్ధరణకు ముందుకువస్తే వారిని ఆదరించిరి. అమ్మవారికి పూజలు చేయుటలోవారి పెత్తనానికి తోడ్పైరి. అలాగే ఆదెమ్మ పేరంటాలు దేవళానికికూడా.

వారి ప్రథమ తాంబూల మర్యాదలకు మద్దతు చేసిరి. ఈ విధంగా B. C. జనాలకు సంఘ గౌరవాలు మత సాంప్రదాయ మర్యాదలలో పెత్తనం సాధ్య పరుస్తూ, సమాన సంఘౌన్నత్యం అందజేస్తున్నారు.

కనుకనే 1980లో మా గ్రామ పనివారి ప్రాంతంలో వారి భార్య శ్రీమతి మంగమ్మ వెంకటప్పయ్య పేర

యం(దుహాయి (హరిజనులు) అందిచ్చిన స్థలములో పఠన మందిరాన్ని మున్సిపాలిటీద్వారా నిర్మించుకొనిరి. ఆ నాడు లక్ష్మీనారాయణ పొందిన ఆనందం ఎంతని? ఇట్టి అనుభావాలెన్నో!

1981లో శ్రీ లక్ష్మీనారాయణ మృతి జెందగా మా ఆదర్శాలు, అనుభవాలు గురించి ఒక గ్రంధమును ప్రచురించితిని! ఆ గ్రంధమందు ప్రస్ఫుటపరిచిన సేవా కార్యాలు, ధోరణులు ఆశయాలు, ఆలోచనలు, కవలలుగా వ్యవహరిస్తూ ఉండిన, యీ వెంకటప్పయ్య లక్ష్మీనారాయణ ద్వయ జీవిత విశేషాలే!

అనిపిస్తూ వుంటూవుండును నాకుఅప్పుడప్పుడు. ఈ రైతాంగ విద్యాలయపు యాభై సం॥లలో, జరుగుతూ ఉండిన, యువజనాల రాకపోకలు చూస్తూ వుండిన, యీ వెంకటప్పయ్య వారికి వేర్వేరుగా పెద్ద వారగుచున్న అనుభవాలు, అధికారాలు తన మనసులో కదులుతూ వుండునే? ఎవ్వరి గురించి ఎంతగా తృప్తి పడుచుందురో! మరెవ్వరు మాతో నడువలేక ఈ రైతు కూలీ ప్రజా రాజ్యాశయపు వ్రతానుష్టానములో జారిపోతూ వుండిరో, వారిపై ఎట్టిప్రేమ, జాలి, స్మృతులు పొందుచుందురోనని?

ఆయన అత్యంత చురుకైన భావకులు, వేదాంత ధోరణి కలవారు. చిన్నప్పుడే నేను "వివేకానంద విజయం" గ్రంధమును ఆయనకు పరిచయ పరచితిని. "రామతీర్థుని" ఉపన్యాసాలను తర్జుమాచేస్తూ చదివి వినిపించుతూవుంటిని, క్రమంగా వారిద్దరిపై ఆయనకు విశ్వాసము కల్గినది, వారి ప్రభోదంబులను పారాయణం చేసుకున్నారు.

1944లో వివేకానందుని విగ్రహ ప్రతిష్టాపనను ఆ నాటి పంచాయితీ ప్రసిడెంట్ తమ మేనల్లుడు కీ॥శే॥ పి. బుచ్చినాయుడుచేత మా రైల్వేస్టేషన్‌వద్ద ప్రతిష్టాపన చేయించిరి.

నేను అందిస్తున్న రైతుకూలీ కళాకారు, బుద్ధిజీవులు, "సర్వ శ్రామిక రాజ్యము" అనే ఆశయం; అది యెట్టిది. యెందులకు, ఎలా సాధించడం, అనుభనీయమా, అనే అనేక వివరాలను రూపిస్తున్న గ్రంథాల అంతరార్థం, అవసరం నిండుగా గ్రహించుకున్న వారిలో వెంకటప్పయ్య మొదటి శ్రేణివారు, తన విశాల వేదాంత దృష్టిలో, వివేకానందులు, రామతీర్థులు, బుద్ధభగవానులు, మహాత్ములు, మానవులనందరిని, మహామనీషులుగా, ధార్మికులుగా, సమానులుగా, పరస్పర ప్రేమికులుగా, వారిని పెంచాలని, పెరగాలని కోరుకున్నారనుకున్నారు. అలాగనే ఈనాటి, కమ్యూనిస్టు - డెమోక్రాటిక్ సంఘర్షణ యుగంలో రైతు కూలీ ప్రజారాజ్యమే రాజకీయ సాధనమని నే చేయు బోధను అంగీకరించినారు. అంతటి విశాల హృదయం, భావం కల్గిన యీ యిద్దరు తమ్ములు. రామానీడు విద్యాలయంలో ప్రొద్దున, సాయంత్రము ఉంటూ ఉందురు. అందినవారితో వివిధ రాజకీయ, సాంఘిక వ్యవహారాలు, ఆయా కాలపు దేశీయానుభవాల దృష్ట్యా చర్చించుతూ ఉందురు.

మా విద్యాలయాలు, రామానీడుకు పరిమితం కాలేదు. ఆంధ్ర, తమిళ, కర్ణాటకరాష్ట్రాలలో సాగినవి. విద్యార్థిబృందాలు, యువజనుల, పౌరుల విద్యాలయాలు, మేము నడిపిన కాంగ్రెస్, కె.యల్.పి., స్వతంత్ర ఇందిరా కాంగ్రెస్ విద్యాలయాలు, తరగతులు, సెమినార్లుద్వారా, మా బోధనా ప్రచారం సాగుతూనేవున్నది. 1933 నుండి 1982 వరకు, ఎందరెందరో, మా బోధనాలయాలలో తయారైనవారు, రాష్ట్రప్రభుత్వ మంత్రులు, సెంట్రల్ మంత్రులు, ప్లానర్లు, లెజిస్లేటర్లుగా పెరిగిరి. వారిలో కొందరు మాత్రమే ధర్మచ్యుతులు. ఎందరో కె.యం.పి. రాజ్యాశయం గురించి, పుస్తకాలు, పాంప్లెట్సు, పద్యాలు, పాటలు వ్రాసిరి. వివిధ భాషల్లో పలుమార్లు పలు ప్రదేశాల్లో!

వచ్చినారు ఆ 1954 లో హంగేరీ మాజీ ముఖ్య మంత్రి కీ॥శే॥ ఫెరంకునాగే. తిరిగి 1957 లో బల్గేరియా రైతు నాయకులు కీ॥శే॥ జార్జి డిమిట్రావ్. వారిద్దరూ అంతర్జాతీయ రైతాంగ యూనియన్ నాయకులు. వారు మా రైతాంగ విద్యాలయములో భాషించిరి. అఖిల ప్రపంచ రైతులు కూలీలు పరస్పరంగా, సమంగా సోదరులుగా వ్యవహరించుకోవాలంటున్న మా నినాదాన్ని అంగీకరించిరని ఆనందమొందిరి. తిరిగి 1978 లో మా మాజీ విద్యార్థి పెద్ద శ్రీ ఓబుళరెడ్డి రెండవమారు ను తిరిగివచ్చి నన్ను కౌగలించుకుంటే పులకితులైరి. అందించినారు నాకొక అమూల్య సహాయుని. మా ఊరి వారే. ఆయన తమకెల్లో తోడైనారు. ఆయనే కీ॥శే॥ డాక్టరు గుమ్మడి శేషయ్యగారు. వ్యవసాయ కూలీ వారి తండ్రి. చిన్నప్పుడు గడ్డిబండిపైనుండి పడితే. చేయి విరిగితే, ఆస్పత్రిలో రక్షించినారు వెంకటప్పయ్య. పిమ్మట బడిలో, మా హైస్కూలులో చేర్పించిరి. భారతీదేవి మద్రాసులో వైద్యాలయంలోకి అందించిరి. డాక్టరుగా తెచ్చుకుంటిమి. కెప్టెన్‌గా, డిస్ట్రిక్ట్ మెడికల్ ఆఫీసరుగా పెరిగిరి. వారు మా విస్తరించిన కుటుంబములో ఒక్కరైరి. అట్టివారినెందరినో, నా అంత పైకి పెరుగలేకపోయినా మా కుటుంబంలోని సోదరులుగా సంపాదించిరి వెంకటప్పయ్య. అనేక ప్రత్యేక బ్రొద్దేయ ప్రతిభ వారిది.

ఈనాడు వారికంతగా ఆరోగ్యం అందడంలేదు. అయినా నేను ఎప్పుడడిగినా "ఫరవాలేదు బాగానే ఉంటున్నది" అంటూ నన్ను తృప్తిపరుస్తారు.

"జరాభారం"ను ధైర్యంతో సంతోషంగా నడుపు చున్నారు. నేను పదే పదే పార్లమెంటుకే పోటీచేస్తూ ఉంటే తాను తృప్తిచెందుతారు. ఓడిపోతూ ఉండటం ఎన్నోమార్లు, తిరిగి గెలుస్తూ ఉండటం మామూలు అనుభవాలుగానే చూచుకుంటారు. పార్లమెంటులో వెలుపల మెంబరుగా ఉన్నప్పుడు, లేనప్పుడు పూర్వపు ధైర్యం, దీక్ష కలిగివుండుటే వారు కోరేది. కాకతీయ వీరులు, జాతీయ నాయకులు, గ్రామీణ ప్రజలు, దిక్కు బాలనివారు, రైతులు, కూలీలు, కళాకారులు సేవించు టలో, రక్షించుకోవడంలో ఎన్నెన్నో మార్గాలు ఎంతెంతో కొండలెక్కుతూ, పడుతూ భయానకమైన సముద్ర తరంగాలపైకి ఎగురుతూ ఉన్న మువ్వురు సోదరులం. ఈ మాత్రం ధన్యజీవులుగా ఉండగల్గు అదృష్టం ఆ సర్వేశ్వరుని దయ. మేము నీతిగ చేసిన తప్పులెన్నో? ఎందరో మహానుభావుల ఆశలకు నిరాశ కల్పించి ఉండవచ్చు. మాతోటి సేవకులకు ప్రత్యేకంగా మా తల్లులు, చెల్లెమ్మలు పెంచుకున్న బిడ్డలకు తోడైన సేవావ్రతానుష్టానులకు ఆ తృప్తి అప్పుడప్పుడు కల్గించి ఉండవచ్చు.

తానొక వ్యవహర్తగా ఎదిగినప్పటినుండి అనగా 1925 నుండి ఇప్పటి వరకు (1982) ఒక్క పర్యాయమైనా పంచాయితీ బోర్డు లేక కో-ఆపరేటివ్ సొసైటీ ఎన్నికలలో నిలబడదల్చలేదు. ఎన్నోసార్లు అంతరంగికుల నిలబెట్టిరి. కొందరిని గెలిపించిరి. సోదరులు లక్ష్మీనారాయణ, పెదనాగయ్యను, కో-ఆపరేటివ్‌లోను, సేల్స్ సొసైటీకి అధ్యక్షులుగా చేసిరి. హరిజనులను సభ్యులుగా చూచుకొనిరి. తనకు మాఊరిలో మాసంఘ, సంస్కార ధోరణలు మెజారిటీ, కూలిజనాల సమర్ధన హరిజనోద్ధరణకు వారు వ్యతిరేకులైనందువల్ల వివిధ పెత్తనాల జోలికి వెంకటప్పయ్య పోనేపోలేదు. అంటరానితనాన్ని 1923 నుండి ఎదిరించితిమి.

ఆ రాజకీయ గ్రామీణ, పంచాయితీ పరిసరాలలో మా ధోరణే అభివృద్ధిదాయకం. మా ఒంటరి తనమే, మైనారిటీ జీవితమే ధన్య జీవనసరళి. ఎవరేమన్నా, ఎంతటి మైనారిటీ పరిసరాలైనా, మా రాజకీయ పంతం, ధార్మిక పంథాయందు వాయువేగంతో, ప్రజాసంక్షేమాన్ని సాధించు సాధన, అనే విశ్వాసం మా కున్నది. అయితే స్పుట్నిక్కులు అంతస్థులలో మేము (భారత దేవి, లక్ష్మీనారాయణ నాతో విహరించు నప్పుడు) సంచరించ నప్పుడు.

అంతటి బాధాయుతమైన సుదీర్ఘమగు వ్రత దీక్షలో కొందరు వెంకటప్పయ్యకు తోడగుచూనే వున్నారు.

40 సం॥రాల నాడు మా గ్రామ హరిజనులు పదులుగా ముందుకొచ్చి జైళ్ళకుకూడా పోయివచ్చిరి. ఆయన తమకై పంచాయితీ స్థలంలో నిర్మిస్తున్న బావిపై సర్వ శ్రామికులకు అందించుచున్న ఆయన్ను తమ్ముళ్లు లక్ష్మీనారాయణను దారుణంగా మారణాయుధాలకు గురి చేయాలనుకున్నపుడు వారిని రక్షించుటకై నిలబడిన హరిజనులు, వెనుకబడ్డజాతులవారు కొందరుండినారు.

అన్నిటినీ ఎదుర్కొనేవారు, భరించేవారు, ఎందరో, ఎన్నోపర్యాయములు కాంగ్రెస్‌వారి తరుపున ఆయన్ను, లక్ష్మీనారాయణను ఒంటరిగా కలిసి మా ఆశయ, ఉద్యమ, రాజకీయ వ్యవహారములనుండి వేరు చేయాలని ప్రయత్నిస్తూనే ఉండిరి. ప్రలోభాలు ఎన్నో చూపిస్తూనే ఉండిరి. వారి బిడ్డల కేవేవో అధికార వసతులు చూపెడుతూనే వుండిరి. హిమాద్రి, వింధ్యాద్రి వలె ఆ సోదరులిద్దరూ నిలబడే వుండిరి. మా నల్గురము ఆ 1923లోనే ఏ సర్వ శ్రామిక జనోద్ధరణ సేవా వ్రతమును కౌగిలించు కుంటిమో, ఆ వ్రతాష్టానమునందే నిలిచిరి. దారి దప్పలేదు. దృష్టి మరల్చ లేదు. మనసు వంగలేదు. హృదయ స్పందన తదేకంగా, దీర్ఘంగా, దృఢంగా ధార్మికంగా, నడుస్తూ ఉంటూ వున్నది.

అనేక తపస్సు. అనేక వీరంగం. అయితే అదెంత కఠుకైన, చురుకైన బాధ కల్గించే ధైర్యం, సహనాల పరీక్షించే కర్కశ కాలం? ఆ బాధలు సహించగలరా? ఎందరు? ఎంతకాలం? ఎట్లా?

1923 నుండి 1982 వరకు అలా వ్రతానుష్టాన పరుడుగా నిలబడుచున్న వీరుడే మా వెంకటప్పయ్య.

వ్రాసితిని, ఆచంటనాగయ్య, కావూరి వెంకయ్య గొట్టిపాటి వెంకటసుబ్బయ్య, లక్ష్మీనారాయణ, నన్నపనేని వెంకటసుబ్బయ్య, గుమ్మడి శేషయ్య, లచ్చన్న, రాజన్న, శెట్టిపల్లి కవి, సభా, ఓబులరెడ్డి, నాగళ్ళ క్రిష్ణయ్య మరెందరో రైతాంగానికి ప్రేమపాత్రులైన, ప్రాణప్రదులైన, సోదర స్నేహవ్రతుల గురించి వారందరినీ, మిగతావారెందరినో దశాబ్దాలు తరబడి అందుకున్నవారు, వెంకటప్పయ్య. ప్రేమించినారు వారిని తన కుటుంబీకులుగా వారి కష్టములే తనవను కున్నారు. వారందరికీ తన ఆశీస్సులు అందించినారు. మా తరుపున వారికి మా విద్యాలయ ఆశీస్సులు అందిస్తూనేఉన్నారు.



# సంస్మరణ

"కళాప్రపూర్ణ" శ్రీ తుమ్మల సీతారామమూర్తి

సత్యమునకు నహింస కాస్థానమైన
పుణ్య యుగమున జన్మించి భోగములను
మఱచి బ్రతుకు సర్వము త్యాగమయ మొనర్చి
చనిన భారతీ. నీ పెంపు సంస్మరింతు.

వడివేసంగి తఱిన్ ఖరాంశుడు జగానన్ నిప్పులం గ్రక్కిన
య్యుడుకున్ సైచి విదేశ వస్త్ర విపణీ వ్యూహంబు ద్రోలన్ నిలం
బడి నీవై పికిటింగు చేసిన కథల్ భావంబునన్ దోచి మా
యొడ లెల్లన్ బులకించు నిప్పటికి; నోహో! దేశసేవాకృతీ!

ఒక్కఁ డెఱుఁగాడు రంగా
యొక్కఁడనే చెఱలబడియె నీవును నాయా
యిక్కట్లు పడితి వోడక
నిక్కపు సహధర్మచారిణీత్వము వెలయన్—

పదవుల కాసింపక సం
పదల కారాట పడక పతిత సమాజా
భ్యుదయము నర్థించిన నీ
బ్రతుకు నెలంతలకు మేలుబంతిగ నిలుచున్

ఈవు మమ్ము వీడి యేండ్లును గడచెనో
కాలచక్ర మెంతగా భ్రమించె
మాకు మాత్ర మీవు మా మధ్యనున్నట్లె
తోచువను దినంబు శౌచమూర్తి!

## ప్రేమవల్లి భారతి

శ్రీ సోంపల్లి బాపయ్య

తెలుగు పల్లి ప్రేమవల్లి
శ్రామికజన కల్ప వల్లి
సకలలోకమ వల్లి
ఎందరికో ఎందరెందరికో
మాతయై నేతయై
సమతా సత్యాలకు నిత్యం
నిలిచి అలసిన హృదయంతో
సొలసిన భారంతో
మా భారతీదేవి పుణ్యధాత్రి
హృదిలో లీనమైన పుణ్యదినం నేడే నేడే-

## భారతీదేవికి సాటి ఎవరు?

శ్రీ జి. జోసప్పు

భావము సుప్రశాంతము ప్రవర్తన నిత్యము మంగళంబుమై
శ్రీ విభవంబు జాజుల పరీమళ సౌమ్యము శోభజెందు సం
జీవి సమానమాత్తలను జీరి వరంబులొసంగు భారతీ
దేవికి పోల్చగా నెవరుదేలరు దేశము పందెమొడ్డినన్-

"కవిని కన్న తల్లి గర్భమ్ము ధన్యమ్ము
కృతితి జెందువాడు మృతుడు గాడు" "జాషువ"

# రైతుబాంధవి

శ్రీ వల్లభనేని కాశీవిశ్వనాథం

పంటకాపుల యింట పంటి పాపై నట్టి
రైతాంగ భారత రాజ్ఞి యెవరు?
గ్రామీణ కర్షక గారాబు పట్టియై
రైతు బాంధవియైన రమణి యెవరు?
పలుకుల బహురాజు కులుకులెరుంగక
కర్షకోద్యమ విద్యుత్కంద యెవరు?
మహనీయుడౌ గాంధి మార్గానుగామియై
శ్వేతాంగ ప్రభుతను చెండెనెవరు?

చిత్ర మనగ సేవయటన్న క్షేత్రలక్ష్మి
రైతు రంగాజి కర్ధాంగి లక్ష్మియామె
పంట బంగారమగుట నాకంటు నోలుక
జాతిరత్నంబు లానంద జలకమయ్యె –

# భవ్యభారతీ జనయిత్రి!

"కాశీపుత్ర" వి. జగన్నాధరావు

తెలుగు పొలములఁ బ్రవహించు సలిలమందు
తెలుగుసీమల వీచెడి గాలులందు
తెలుగు గుండెలఁ గన్పించు తెగువ యందు
తెలుగు బంగరు భూముల దీప్తులందు
నీదు రూపమ్ము యంతట నిండియుండె
దివ్య దేహ ధారిణి వౌటఁ దెలుగు జాతి
సౌఖ్య సౌభ్రాత్ర సౌభాగ్య సరళితోడ
సహరహమ్ముల దీపించునటులనీవు
దీవనల గురిపింపుము తెలుగునేల
భవ్య భారతీ జనయిత్రి! పరమసాధ్వి!

# సుధామయి! భారతీదేవి

శ్రీ కన్నెగంటి వీరభద్రాచార్యులు

నీవును నీమనోహరుడు నేర్పు విధానములం గ్రహించి మే
ధావులు సంతసించిరి సుధామయి! మీమధుర ప్రబోధ గీ
తావళి నాలకించి ముదమందిరి మానవులంత. భారతీ
దేవి! మదంబ! మీపసిడి దీవెనలం గొనె సర్వ సంఘముల్.

ఈకవి మాకుమారుడని, యెల్లరకున్ దెలియంగ బల్కి స
న్నాకరణంబగనుం గొనుచు హర్షపయోనిధిఁ దేల్చితల్లి. సు
శ్లోక చరిత్ర! భారత వసుంధర వీడి వియత్పథంబునన్
నాకముజేరు వార్తవిని నాహృదయమ్ము తపించె నక్కటా!

పతికనుసన్నలం గదలి భారత భవ్యమహోద్యమమ్ములన్
సతతము సాగజేయుచుఁ బ్రజాహృదయమ్ముల మేలుకొల్పి. య
ప్రతి హతశక్తిఁ జూపితి వపార కృపామతి భారతీ! పతి
వ్రతవు. సమస్త ధర్మములు వర్ధిలుచుండు భవన్మనమ్మునన్—

శీలము మీగుణమ్ముల వసించు నజస్రము. మాయరాజకీ
యాలకు దావునీని హృదయమ్ములు మీయవి. పొందు కష్ట న
ష్టాలకు నించుకంతయు జంకరును మీరలు, మిమ్ము నెవ్వరుం
బోలరు తల్లిరో! విడచిపోయితివా! మము స్వర్గసీమకున్

నాయకులంత మీప్రవచనమ్ముల నమ్మకనాటి మీయభి
ప్రాయములం గ్రహింపక పాయములంబడి గౌరవమ్ముఁ గో
ల్పోయిరి నేడుకూలబడి పోయిరి హేతువులేక తీతువుల్
కూయవటంచుఁ బల్కితి వికొంకక ముందుగ నీవు భారతీ!

ఓ మహిళాశిరోమణి! మహోన్నతభాషిణి! నీ ప్రియుండు రం
గా మహనీయుడింకెటుల కాలము బుచ్చును నిన్నుబాసి హా!
మేమెటు చింతఁ బాసెదము! మేలగు తల్లివినీవు స్వర్గసం
ధామముఁ జేరియుంట. ఇది ధర్మమటంచు దలంచుచుంటివా?

# ఆచార్య రంగా

కొసరాజు ఉమావరమూర్తి

శ్రీ రామా రూరల్ కళాశాలలో సెప్టెంబరు 7వ తేదీన, ఆచార్య రంగాగారి జన్మదినోత్సవము జరుగుబోవడం వారి సతీమణి శ్రీమతి భారతీ దేవిగారి సంస్మరణార్థము ఒక వసతి గృహము మన ఉపరాష్ట్రపతి శ్రీ శంకర్‌దయాళ్ శర్మ గారు, ప్రారంభోత్సవము చేయుట, మాకు చాలా సంతోషంగా వుంది. మామూలుగా అయితే నేను ఆ సందర్భంగా అక్కడికి వచ్చి ఉత్సవాలలో పాల్గొనే వాడిని. నా ఆరోగ్యము సరిగా లేని కారణంగా ప్రస్తుతం, అక్కడికి వెళ్ళకుండా పూర్తి విశ్రాంతి తీసుకుంటున్నాను.

ఆచార్య రంగాజీ, జన్మదినము మీరు జరుపడం చాల సముచితముగా వుంది. మీది గ్రామీణ ప్రాంతములో నెలకొల్పిన, పల్లెప్రాంతము వారికి విద్యాభ్యాసించుటకు అనువైన విద్యాలయము. రంగాజీ ఆశయాలు, వారి రాజకీయ విలువలు, గ్రామీణుల, ముఖ్యంగా రైతుల సమస్యలు, ఒకదానికి ఒకటి ముడిపడివున్నవి. కాబట్టి మీ విద్యాలయాలు, వారి సేవలను స్మరించుకోవడం వారిని సత్కరించడం, చాలా సముచితంగానూ, సంతోషంగానూ వుంది,

రంగాజీ రాజకీయ జీవితంలో, వారి వ్యక్తిత్వంలో ముఖ్యంగా రెండు విషయాలు కనబడుచున్నవి. ఒకటి - గాంధీజీ కాంగ్రెసులో దేశవ్యాప్తంగా తీసుకొచ్చిన మౌలికమైన మార్పు, రంగాజీ ఆంధ్రదేశంలో తీసుకొచ్చారు, మహాత్ముడు కాంగ్రెసును మధ్యతరగతి, ఉన్నత వర్గాల నాయకత్వంలో నుండి, గ్రామసీమలో వున్న, పేదప్రజలకు చేరువగా తీసికొచ్చారు. అలాగే రంగాజీకు ముందు. ఆంధ్రదేశంలోకూడ కాంగ్రెసు పట్టణవాసులైన ప్లీడర్లు, పెద్దపెద్ద హోదా కలిగిన ఆస్తిపరుల నాయకత్వంలో వుండేది. రంగాజీ గ్రామసీమలో పుట్టారు. రైతు కుటుంబంలో పెరిగారు, అందువలన, గ్రామప్రజల, రైతుల సమస్యలను చాలా బాగా అర్థంచేసుకొన్నారు. కాంగ్రెసు ఆశయాలను గ్రామాలలో వ్యాప్తిచేయడం, గ్రామీణులను, కాంగ్రెసులో భాగస్వాములుగా చేయడం లో రంగాజీ కడు సమర్థవంతమైన పాత్ర వహించారు. అందువలననే వీరి నాయకత్వంతో జమిందారులను ఎదిరించటము, వారికి స్వస్తి చెప్పడం జరిగింది. గ్రామాలలో రాజకీయ పాఠశాలలు నెలకొల్పడము జరిగింది, అంతేకాదు, పార్లమెంటులో ఎప్పుడూ రైతు ప్రతినిధిగా, రైతు సమస్యలను గురించి మాట్లాడటం, వారికి న్యాయము జరిగేటట్లు చూడటము, రంగాజీ చేశారు. ఈ రోజుకు గతించిన మొదటి కాంగ్రెసు నాయకత్వమునకు ఏకైక ప్రతినిధి అయిన రంగాజీ, రైతు సమస్యలు, ప్రధానంగా పార్లమెంటులోనూ, వెలుపల కూడ చర్చించుతారు. వాటి కొరకు పాటుపడతారు.

రెండోది, వారి వ్యక్తిత్వంలోని విలక్షణమైనది. వారు నమ్మిన ఆశయానికి కట్టుబడి ఉండటం అందరికీ తెలుసు. పార్లమెంటులో రైతు సమస్యల పరిష్కారానికి, నెహ్రూగారు చేసిన, ప్రతిపాదనలను ఆయన తీవ్రంగా వ్యతిరేకించారు. నెహ్రూజీ సమిష్ట వ్యవసాయ రంగాన్ని ప్రతిపాదించగా రంగాజీ అది మన దేశానికి సరిపోదని, ఆ వ్యవస్థలో రైతు స్వతంత్ర భావాలు, అస్తిత్వము నశించిపోతాయని వాదించారు. నెహ్రూజీ

మంత్రి పదవి యిస్తానన్నా, దాన్ని ఆశించలేదు. అగ్ర నాయకుడైనా, ఎప్పుడూ పదవులను ఆశించలేదు. ఈ రోజుకు వారు చాలా నిరాడంబరులు. వారు నమ్మిన సిద్ధాంతాలను వారు ఎప్పుడూ గౌరవించుతూ వచ్చారు.

ఈ విధంగా ఎంతో స్ఫూర్తివంతమైన, వ్యక్తిత్వం కలిగిన రంగాజీ 89వ జన్మదినోత్సవం మీ గురుకులము వారు జరుపుట మీకే కాక ఆంధ్రులందరికీ సత్కారణం, ఈ శుభ సందర్భాన మా కళాశాల అధ్యాపకుల, విద్యార్థుల తరఫున మా హృదయపూర్వక శుభాకాంక్షలు అందజేస్తున్నాం.



'క్షేత్రలక్ష్మి' కవిబ్రహ్మ ఏటుకూరి

కాయము గాయమై నురిగి గడ్డకు బుట్టెడి నీరు ద్రావి, దీ
ర్ఘాయువుగా శ్రమింప గల దార్ధికవేత్తలు తల్లక్రిందులై
పోయిన నెగ్గి రాగలడు పుట్టినదాది స్వతంత్ర జీవన
చ్ఛాయల విశ్రమింప గల సార్ధకజీవికి జన్మ మున్నదా?

చుంగుల్ వాటిన ఖాది చుట్టి ముదుగుం జొక్కాను కైసేసి ముం
జెంగున్ గుచ్చెళ లంట జెక్క, కుంకుమం జెప్పుల్ సమాళించిపల్
రంగుల్ గుల్కెడు చెంద్రకోల ములుగట్టుం బూని కొంచేరుతో
సింగారమ్మయి పోవు నైతు సిరి నిక్షేపింతువా లేఖినిన్.

మాన్యశ్రీ ఆచార్య రంగాజీకి ఎనుబది తొమ్మిదవ జన్మదినోత్సవ సందర్భమున సమర్పించు

# కానుక

'శతావధాని' నిమ్మగడ్డ రామకోటేశ్వరశాస్త్రి

శ్లో॥ సహోత్తరాశీతికవర్ష జీవీ
శ్రీ "రంగ" నామాంకిత యస్యకీర్తిః
శ్రియా దయం భారత భాగ్యనేతా
సమాశ్రితం రాష్ట్ర మహోదయార్థం!

ఆచార్య !

సీ॥ జనియించినావు పచ్చని చేలు దీర్చెడి
హాలిక వర్య గృహమ్ము లోనఁ
జదివినా వాంగ్లభాషను నర్థశా
స్త్రంబు నిగ్గంటుగా దయల నొంది
అర్జించినావు మహాచార్య పదవిని
దగుబడు నీ వనుమ నుత్తములు పొగడ
సాగించినావు విశ్వ మెల్ల మెచ్చంగ
స్వాతంత్ర్య రణము నిస్వార్థ బుద్ధి.

తే॥గీ॥ రైతుజన బాంధవుండవు పక్షపాతి
గుములు హాలికఁ బ్రజలను నకు పెరాల
దృష్టి నోదార్చు నాయక ధీరుఁడవును;
నీ కివే జోత లిత్తుము స్వీకరింపు !

తే॥గీ॥ రైతు కూలీ ప్రజారాజ్య రథము నడుపు
సారథివి గావె రంగాజీ ! సామ్యవాద
పథము ద్రొక్కిన నెందరో స్వార్థ చింత
నొసరివినారు; నీ కది యుల్లఁ బాటు !

ఆ॥వె॥ రాజకీయములను రాణింతవలె నన్న
మంత్ర తంత్రములను మలచ వలయు
వాని నెఱుఁగ నట్టి ప్రామాణికుండవు
నీకు సాటి గలరె నీతిలోన !

కం॥ శత మాయువంతయు నేలిన
నతిశయముగఁ గోరువాఁడ నంతకుఁ బైనే
త్పృత నిండిన మీ కత
స్తుతి పాత్రము ధర్మమార్గ చోదక శక్తిన్

తే॥గీ॥ సెలవు కర్షక జనమణీ! సెలవు సెలవు!
సెలవు గాంధేయ పథగామి! సెలవు సెలవు!
వయసు మీఱిన దేశ సేవానురక్తిఁ
గెడయఁబోవని మీ కిదే కేలుమోడ్పు!



# కర్షకా! నీ కళ్ళు కదలినన్నాళ్ళే

— శ్రీ శ్రీ

నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాదకుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్ప కయ్యాలు కవిరాజు కావ్యాలు
కర్షకా! నీ కళ్ళు కదలినన్నాళ్ళే.
దాంభికుని తత్వాలు మాంత్రికుని మంత్రాలు
తాంత్రికుని తంత్రాలు
గురువుల గోప్యాలు గుడుగుడు గుంచాలు
దేవుళ్ల తిరునాళ్లు దివ్యనది తీర్థాలు
కర్షకా! నీ కళ్ళు కదలినన్నాళ్ళే.

ధార్మికుని దానాలు పండితుని భాష్యాలు
జ్యోతిషుని జోస్యాలు తార్కికుని తర్కాలు
వర్తకుని వాజ్యాలు వకీళ్ల వాదాలు
సైనికుని శౌర్యాలు యాంత్రికుని యంత్రాలు
యోధుల యుద్ధాలు రాజుల రాజ్యాలు
కర్షకా! నీ కళ్ళు కదలినన్నాళ్ళే.

# ప్రేమోపహారము

అన్నే సూర్యనారాయణ
గుంటూరుజిల్లా గ్రామీణ ప్రజా సమాఖ్య అధ్యక్షులు

రైతు బాంధవుడు ఆచార్యరంగా 1900 సం॥లో పల్లె గ్రామమైన, నిడుబ్రోలులో ఉన్నత రైతు కుటుంబములో జన్మించినారు. ప్రాథమికవిద్య స్థానికము గాను, విదేశములలో ఉన్నత విద్యలు అధ్యసించియు, ఉద్యోగములు త్యజించి, భారతదేశ స్వాతంత్ర్య పోరాటములలో మిక్కిలి కృషిసల్పిన జాతీయ నాయకులలో కొలదిమందిలో ఒకరు. పరాయి ప్రభుత్వములలోనూ, జాతీయ ప్రభుత్వములలోనూ, సంఘశక్తి యున్న వర్గములు, సంఘశక్తిలేని పల్లె గ్రామాదుల, రైతులు, వ్యవసాయ కూలీలు, చేతివృత్తులవారిని, ప్రపంచంలోను, భారతదేశములోను, ఆర్థిక, సాంఘిక రాజకీయ రంగములలో వెనుకకు నెట్టబడి, దోపిడికి గురియై యున్నారు. వారికి సంఘశక్తి కల్పించి నాయకులను తయారుచేసి కొంతవరకు ఉన్నతికి వచ్చుటలో 60 సంవత్సరములు యెనలేని కృషిసల్పియున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో లక్షల కొలది ఎకరములకు నీటివసతి యేర్పడి, యెక్కువ మంచిపంటలు పండుటలోను యిరిగేషన్ ప్రాజెక్టులు యెంతయో అవసరము. పార్లమెంటు సభ్యులుగాను, కాంగ్రెస్ నాయకులుగాను. రైతు నాయకులుగాను ఉంటూ 1934 వ సంవత్సరము నుండి, రైతు సభలద్వారా పార్లమెంటులో తీర్మానముల ద్వారా, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వములకు మెమోరాండముల ద్వారా కృషి సల్పియున్నారు. స్వర్గీయ శ్రీ కడప కోటిరెడ్డిగారి తోడ్పాటుతో 1935 వ సంవత్సరములో తుంగభద్ర ప్రాజెక్టును, పింగలి సూర్యనారాయణ పంతులుగారు (కొండూరు కరణంగారు) తోడ్పాటుతో పెదవడ్లపూడి (రంగా) హైలెవెల్ చానలు 1937 వ సంవత్సరములో పెదకొండూరు హైలెవెల్ చానలు, స్వర్గీయ ముక్త్యాల రాజా శ్రీ రాజా వాసిరెడ్డి శ్రీరామ గోపాలకృష్ణ మహేశ్వర ప్రసాదు, మోటూరు సత్యనారాయణ. ఎం.పి., శ్రీ నాగినేని వెంకయ్య, శ్రీ కోసూరి కన్నయ్య, శ్రీ కె. ఎల్. రావుగారు, శ్రీ కాపూరి వెంకయ్య, శ్రీ గుర్రం మల్లయ్య, శ్రీ నల్లపాటి వెంకటేశ్వరరావు, శ్రీ అన్నే సూర్యనారాయణ గార్ల సహకారముతో ప్రపంచ పెద్ద ప్రాజెక్టులలో ఒకటయిన నాగార్జున ప్రాజెక్టు 1952 వ సంవత్సరంలో ఏర్పడి లక్షలాది ఎకరములకు, నీటి సదుపాయములు కలిగి. కోట్లాది ప్రజలకు జీవనభృతి కల్పించుటలో కృషి సల్పిన వారిలో శ్రీ రంగాగారు ప్రథములు మద్రాసు ప్రభుత్వమువారు నాగార్జునసాగర్‌కు వ్యతిరేకించినను, ఖోస్లా కమిటీ ఏర్పడుటకు వారిని మద్రాసు నుండి నందికొండకు తీసుకొనివచ్చి చూపించుటలోను, భారతదేశ యిరిగేషను మంత్రిగాయున్న శ్రీ ప్రకాశ్ గారి, ఆంధ్రప్రదేశ్ గవర్నరుగాయున్న శ్రీ త్రివేదిగారి తోడ్పాటులు పొందుటలో శ్రీ రంగాగారి కృషి ఎక్కువ ఉన్నది, గుంటూరులో హైలెవెల్ చానలు ఏర్పాటులో కూడా బండ్లమూడి వెంకటశివయ్యగారి తోడ్పాటుతో 1965 లో పూర్తిచేయబడినది.

1935 సంవత్సరము నుండియు పార్లమెంటు సభ్యునిగా యుండుటయేగాక 1970 వ సంవత్సరము నుండియు పార్లమెంటు సభ్యునిగాను, కాంగ్రెస్ పార్టీ పార్లమెంటు ఉపాధ్యక్షునిగానువుంటూ, స్వర్గీయ శ్రీమతి

ఇందిరాగాంధి గారికి, ప్రస్తుత ప్రధానిగావున్న శ్రీ రాజీవ్‌గాంధి గారికి జాతీయ, అంతర్జాతీయ విషయము లలో మీ తోడ్పాటు ఎంతయో ప్రశంసనీయము.

ప్రపంచ దేశములలో ప్రజాయెన్నిక ప్రభుత్వ ములు యుండుట వృత్తి స్వేచ్ఛ, వ్యక్తి స్వేచ్ఛ యుండుట వలననే, ప్రజలశ్రేయస్సు, పంట అభివృద్ధి దేశముల అభివృద్ధి చెందును. రైతు, కూలీ, ప్రజారాజ్య - సిద్ధాంతమును ప్రపంచ దేశములలో ఎక్కువ భాగము అంగీకరించినవి, ఇది శ్రీ రంగాగారి ముందుచూపునకు నిదర్శనము. ఇంగ్లాండు ఆక్స్ఫర్డులో విద్యార్థిగాయుంటూ శ్రీ కాశీనాథ నాగేశ్వరరావుగారిచే ప్రచురింపబడుచున్న జాతీయ ప్రముఖ దినపత్రిక అయిన ఆంధ్రపత్రికకు 1920 సంవత్సరములోనే యూరప్‌దేశాల విలేకరిగావుంటూ, జాతీయ, అంతర్జాతీయ, కార్మిక, కర్షకసమస్యలపై వార్తలుపంపి అప్పటి నుండి ఇప్పటి వరకు ఆంధ్రపత్రిక సంపాదకవర్గముతో సహకరించుచున్నారు. తదుపరి క్రాంతి, గోభూమి, వాహిని జాతీయ పత్రికలను నెలకొల్పి, సుప్రసిద్ధ పత్రికా సంపాదకులైన శ్రీ న్యాపతి నారాయణ మూర్తి, శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు, శ్రీ ఎస్. జి. ఆచార్య, శ్రీ పెద్దరెడ్డి తిమ్మారెడ్డి, శ్రీ గోగినేని లక్ష్మీనారాయణ, శ్రీ పుండరీకాక్షాచారి, శ్రీ జె. ఉమా మహేశ్వరరావు, శ్రీ బి. ఎన్. కృష్ణ, శ్రీ కె. సి. సుబ్బయ్య, శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, శ్రీ జి. విశ్వనాధం, శ్రీ భీమని సత్యనారాయణ, శ్రీ దరువూరి వీరయ్య, శ్రీ వెల్లంకి చంద్రపాల్ నాయకత్వములో జాతీయ, స్వాతంత్ర్య పోరాటములలోను, ఈ నాండారి, జమీన్‌దారి, రైతాంగ పోరాటములో శ్రీ ఆచార్య రంగాగారి ప్రోత్సాహముతో పత్రికలు, సంపాదకులు మిక్కిలి కృషికల్పి సత్ఫలితములను పొందియున్నారు, రంగాగారు తెలుగు, ఇంగ్లీషు భాషలలో జాతీయ, అంతర్జాతీయ, ప్రముఖ దినపత్రికలకు, ప్రజా సమస్యలపై అనేక వ్యాసములు వ్రాసిన ఖ్యాతికేయుడు ఆర్థిక, రాజకీయ, గ్రామిక, రైతు సమస్యలపై ప్రపంచ ప్రజలకు పనికివచ్చు అనేక యింగ్లీషు, తెలుగు పుస్తకములను వ్రాసి, వ్రాయించి అచ్చువేయించి, భారతదేశ ప్రజలకే గాక ప్రపంచ ప్రజలకు పనికివచ్చు పుస్తకములను ప్రచురించిన మహామనీషి. గ్రంథకర్త మహాత్మాగాంధి గారితోను, త్యాగమూర్తి శ్రీ సుభాష చంద్రబోస్, శ్రీ సర్దారు వల్లభాయిపటేలుతోను, తొలి ప్రధానమంత్రి అయిన శ్రీ జవహర్‌లాల్ నెహ్రూతోనూ, తొలి గవర్నరు జనరల్ అయిన సి. రాజగోపాలాచారితోనూ తదితర నాయకులతో కలసి పనిచేసి ప్రపంచమునకు, ఇండియాకు ఎనలేని సేవలు అందించిన ప్రసిద్ధ పురుషుడు.

మీ అనుభవములతో ప్రపంచ ప్రజలకు మేలు చేకూర్చు, సిద్ధాంతపరమైన రైతూకూలీ ప్రజారాజ్య నిర్మాణమునకు మార్గదర్శిగా ఒక మంచి గ్రంథమును. మీరు మీ సహచరులతో పూర్తిచేయవలయునని కోరు కొనుచూ తమకు భగవంతుడు ఆయురారోగ్యములు ప్రసాదించవలసినదిగా కోరుకొనుచున్నాము.



విధి ఎంతటి క్రూరమైనదైనప్పటికి, జీవితం కన్నీటి కడలిగా మారినప్పటికి చిట్టచివరికి జీవితాన్ని ఆనందమయం చేయగల ఒక దివ్యశక్తి ఉన్నదని నమ్ముతున్నాను. — వర్డ్స్‌వర్త్

# రైతు-కూలీల పెన్నిధి రంగాజీ

భీమవి సత్యనారాయణ బి. ఏ.
( వాహిని )

కర్షకుని తలపై కిరీటంబు పెట్టు
కార్మికుల కంఠరికి పట్టంబు గట్టు
అధికార మొకరిపై ఒకరి కొద్దయ్య
స్నేహపథ మొక్కటే క్షేమ కరమయ్య!

ఈ మహత్తర ఆశయసిద్ధికై అనవరతం కృషి సల్పుతున్న ఆదర్శరైతు కూలీ ప్రజానాయకుడు ఆచార్య రంగా. ఆంధ్రమాత ముద్దుబిడ్డడై అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన అసమాన నాయకాగ్రణి ఆచార్యుడు. భారత జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో అగ్రశ్రేణిని నిలచి పోరాడిన ధీరోదాత్తుడు అపూర్వ త్యాగమయ జీవి రంగాజీ.

భారతదేశం గ్రామీణభారతం. ఎనభైశాతం ప్రజలు గ్రామాల్లో నివసిస్తున్నారు. గ్రామీణులలో 80 శాతం వ్యవసాయం ప్రధాన వృత్తిగా గలవారు, అందు వలన భారత సామాజిక, ఆర్థికవ్యవస్థ ఒకవిధంగా రైతాంగవ్యవస్థే. భారత స్వాతంత్ర్యోద్యమం తొలుత పట్టణాలకు మేధావి వర్గానికే పరిమితమైంది. అందు చేతనే అది నిండుదనం సంతరించుకోలేక పోయింది. రంగాజీలాంటి గ్రామీణ రైతునాయకుల నేతృత్వంలో జాతీయోద్యమం గ్రామాలకు, పల్లెలకు ప్రాకింది. రైతు కూలీజనంలో జాతీయభావం, నూతనోత్తేజం వెల్లివిరిసింది. పరాయి పాలనతోపాటు నాటిపాలకులకు దళారీలుగా రైతులను పీల్చిపీడించే జమీన్ రైతు ఉద్యమం చేపట్టి వీరోచితంగా పోరాడారు, పరాయి పాలన అంతమైంది. స్వాతంత్ర్యం సిద్ధించింది. జమీం దారులుకూడా కాలగర్భంలో కలిసిపోయారు. రైతులకు తమ భూములపై యాజమాన్యం ఏర్పడింది. రైతు స్వామ్యం నెలకొన్నది. రంగాజీ కలలు ఫలించాయి.

కాగా కాంగ్రెసు పాలనలో క్రమేణా రైతు స్వామ్యాన్ని హరించే సహకార, సమిష్టి వ్యవసాయం అనుకూల ధోరణి ప్రబలింది. ఈ ధోరణిని తీవ్రంగా ఎదిరించి పోరాడారు రంగాజీ. రైతులకు వారిభూముల పైగల హక్కులను రద్దుపరచి వారిని ప్రభుత్వ దాసులుగా దిగజార్చే యీ కుట్రను కుతంత్రాన్ని భగ్నపర చారు. స్వంతకమతాలే ప్రజాస్వామ్యానికి పెట్టుగడ యని, అధికోత్పత్తికి దోహదకారియని వక్కాణించారు. నాడు రంగాజీ ధోరణిని స్వ-పరరాజకీయ పక్షాలు విమ ర్శించాయి. కాని నేడు సమిష్టి వ్యవసాయాన్ని నిర్బంధంగా అమలు జరిపిస్తున్న రష్యా. చైనాలకు జ్ఞానోదయం అయి రైతులకు స్వంత కమతాలు కొంత మేరకు అనుమతిస్తున్నాయని వార్తలొస్తున్నాయి. ఈ పరిణామం రంగాజీ సిద్ధాంతానికి విజయం ఇలా రైతాంగ ప్రజాస్వామ్యాన్ని హరించే సహకార సమిష్టి వ్యవసాయ ప్రవాహానికి అడ్డు కట్ట వేయగలిగారు రంగాజీ

భూ సంస్కరణలపై రంగాజీ దృక్పథాన్ని సరిగా అర్థం చేసుకొన్నవారి కంటే అపార్థం చేసు కొన్నవారే మెండు. ఈ సందర్భంగా రంగాజీ ధోరణిని స్వార్థపర వర్గాలు వ్యతిరేకించాయి. అపహాస్యం చేశాయి. అంతేగాదు రంగాజీ భూస్వాముల తొత్తు అని కూడా

దుష్ప్రచారం సాగించాయి. ఇంత క్రూరంగా రంగాజీ దృక్పథం ఏమిటో తెలుసుకుంటే ఈ స్వార్థపరుల ప్రచార బండారం బయట పడగలదు.

భారతదేశంలో ఆస్తి ఆదాయాలు అనేవి అనేక రూపాల్లో ఉన్నాయి. అవి భూమి రూపంలో ఆస్తిగాను దాని పంట రూపంలో ఆదాయం గాను ఉన్నవి. భవనాల రూపంలో ఆస్తిగాను - వాటిపై అద్దెల రూపంలో ఆదాయం గాను ఉన్నవి. కంపెనీలలో షేర్ల రూపంలో ఆస్తిగాను. వాటిమీద డివిడెండు రూపంలో ఆదాయం గాను ఉన్నది. ఉద్యోగ రూపంలో ఆస్తిగాను - నెల జీతం రూపంలో ఆదాయం గాను ఉన్నది.

ఇలా ఆస్తి - ఆదాయాలు పలు రూపాలు ఉన్నాయి. కాగా ఆస్తులకు, ఆదాయాలకు పరిమితులు పెట్టాలని ప్రభుత్వం తలచింది. అందుకై వ్యవసాయ ఆస్తుల పైనే కత్తివేటు వేయటం, వాటికే పరిమితులు పెట్టదల చట్టం ద్రోహ చింతన కాదా? దుష్టబుద్ధి కాదా విచక్షణా రహితం కాదా? పక్షపాత ధోరణి కాదా? అనేదే రంగాజీ ప్రశ్న. ఈ ప్రశ్న సబబు, సహేతుకం కాదన గలమా?

ఇంతకూ ప్రభుత్వాశయం ఈ పరిమితుల పేర రైతువర్గాన్ని అణగదొక్కాలనేదే! వారికి నాయకత్వం లేకుండా చేయాలనేదే! ఇందుకు పాలక పక్షం వారికి, వారి సలహాదారులకు గ్రామీణ ప్రజానీకం పట్లగల ద్వేషం కారణం. ఈ పథకాలు రూపొందించేది గ్రామీణ ప్రాంతాల పట్ల ద్వేష భావంగల పట్టణ మేధావి వర్గం వారి నుంచి వచ్చిన ఉద్యోగులు. అమలు జరుప పూను కొన్నది. పాలకపక్షం ప్రజా ప్రతినిధులైన పార్ల మెంటు సభ్యులు. వీరిలో అధిక భాగం రైతు కుటుం బాల నుండి వచ్చినా ఆ రైతు వర్గ భావనలేని కుహనా రైతులు. అందువల్లనే యీ దుష్టచింతన అడ్డూ, అపూ లేకుండా సాగిపోతున్నది. ఇదే ధోరణి రైతుల పంట లకు న్యాయమైన, గిట్టుబాటు ధరలు కావాలనే సహేతుక మైన కోరికపట్ల కూడా ఎదురౌతున్నది. రైతుల పంట కు న్యాయమైన ధర కోరటం అత్యాశ అట! ఇది ధనిక రైతులకు అనుకూల ధోరణి యట! అందువలన యీ కోరికను పరిశీలించ నవసరం లేదట! ఈ వాదం చేస్తున్నది. పై తెలిపిన పట్టణ మేధావులు ఉద్యోగులు పాలక వర్గ పెత్తందారులు. ఇక్కడ ఒక విచిత్ర మేమంటే ఆ ప్రభుత్వ ఉద్యోగులే తమకు నెలకు మూడు, నాలుగువేలు జీతంగా సాలుకు యాభైవేలు ఆదాయం వస్తున్నా చాల లేదంటూ జీతాలు పెంచమని ఆందోళన చేస్తున్నారు. సమ్మెలు చేస్తున్నారు. ప్రభు త్వాన్ని యిరకాటంలో పెట్టి సాధించు కొంటున్నారు. ఇక ప్రజాసేవకు అని వచ్చిన పార్లమెంటు సభ్యులు శాసన సభ్యులు తమ జీత భత్యాలు పెంచు కుంటున్నారు. ఇలా ప్రభుత్వం తమకు అంటే మంత్రులకు. శాసన సభ్యులకు, తమ ఉద్యోగ వర్గానికి ఆదాయం మాత్రం పెంచుతూ పోతున్నది. రైతుల ఆదాయాలకు మాత్రం పరిమితులు కావాలంటున్నది. ఇదే వింతల్లోకెల్లా గొప్ప వింత, విడ్డూరం.

అందువల్లనే సమాజములోని అన్ని వర్గాలకు ఆదాయ పరిమితులు విధించకుండానే ఒక్క రైతు వర్గాన్ని విడదీసి, ఏకాకినిచేసి వేధించబూనటం దుర న్యాయం, అక్రమం అని ఎలుగెత్తి చాటుతున్నారు రంగాజీ. ఈ వాదం న్యాయసమ్మతం అని సమ్యక్ దృష్టిగల ప్రతి ఒక్కరూ ఆమోదించి తీరగలరు. ఈ సందర్భంగా నెహ్రూజీ రంగాగారితో చర్చిస్తూ "రైతు లకు యింతింత భూములు ఎందుకు అని అడిగినప్పుడు రంగాజీ సమాధానమిస్తూ "మీకు బ్యాంకులో యింత నిలువడబ్బు ఎందుకు అని మా రైతులుకూడా మిమ్మల్ని అడిగేరోజు వస్తుందని హెచ్చరించారు.

రంగాజీపట్ల మరొక అపవాదు, వారు ధనిక భూస్వాములపక్షం అనేది ఇదికూడా అర్థరహితమైనది. దుర్బుద్ధితో చేసినది. రైతాంగాన్ని అంతటిని ఒకే వర్గంగా భావించాలని రంగాజీ వాదన. వారిని చిన్న,

పెద్ద, మధ్యతరగతి అంటూ విభజించి పాలించే కుటిల రాజకీయవాదుల ఎత్తులను చిత్తుచేశారు. రైతాంగంలో 80 శాతం మధ్యతరగతి సన్నకారు రైతులే. కనుక రైతాంగానికి ఉపకరించే ఏ ప్రణాళిక అయినా, ప్రయోజనం చేకూర్చే ఏ పథకమయినా అధిక సంఖ్యాకులైన చిన్న, సన్నకారు రైతులకు మేలుచేకూర్చుతున్నదే.

వ్యవసాయ పంటల ధర పెంపుదలలాంటి చర్య రైతాంగంలో అధిక భాగంగావున్న పేద, మధ్య తరగతి రైతాంగానికి మరింతగా ఫలితం సమకూరుస్తుంది. ఈ విషయాన్నే రంగాజీ వివరిస్తూ ఈ పథకం ధనిక రైతులకే ఉపయోగపడుతుందనే వాదన ఖండించారు. "ఇలాంటి పథకాల వలన ధనిక రైతులుగావుండే 10 శాతం మందికికూడా లాభిస్తే లాభించనివ్వండి. కాగా 100 కి 80 మందిగా ఉన్న అధిక సంఖ్యాకులైన చిన్న సన్నకారు రైతులకు లాభించడమే నేను కోరుకునేది "ఇదే మనం పరిష్కరించవలసిన అంశం" అన్నారు. ఇది సబబైన ధోరణి కాదనగలమా?

ఇక వ్యవసాయ కూలీలను వ్యవసాయరంగంలో ఒక భాగంగాను, రైతువ్యవస్థలో ఒక అంశంగాను రంగాజీ భావించేవారు. వ్యవసాయకూలీలను రైతులుగా మార్చాలనేదే ఆచార్యుని ఆకాంక్ష. అందుకై ప్రభుత్వపరంగా ఉన్న లక్షలాది ఎకరాల బంజరుభూమిని భూమి లేని వ్యవసాయ కూలీలకు పంచాలని డిమాండుచేశారు. తద్వారా వారినికూడా రైతులుగా మార్చాలని, రైతువర్గ దృక్పథం వారిలో కలిగించాలని రంగాజీ ధ్యేయం. ఈ విధంగా వారి అభ్యున్నతికి తోడ్పడాలేకాని వర్గద్వేష దృష్టితో రైతు-కూలీలమధ్య చిచ్చురగిల్చి వ్యవసాయ రంగాన్ని నాశనం చేయరాదని రంగాజీ ఆవేదన.

ఇలా రైతుకూలీ సమస్యలపై పాలకపక్షంలోనూ, ప్రభుత్వంలోనూ ఎదురులేని, తిరుగులేని నాయకుడు నెహ్రూనుసైతం ఎదిరించి నిలిచి పోరాడిన ధీశాలి ఆచార్య రంగాజీ. ఆయనకు సిద్ధాంతాలపట్లవున్న నిబద్ధత, రాజీలేని పోరాట ధోరణి, ప్రభుత్వం తలపెట్టిన రైతు వినాశకర పథకాలకు అడ్డుకట్ట వేయగలిగింది. రైతు శ్రేయోదాయక పథకాలకు శ్రీకారం చుట్టగలిగింది, "రంగాజీ పార్లమెంటులో ఉండగా రైతు సమస్యలను ఎలా అలక్ష్యం చేయగలము" అని నెహ్రూను సైతం ఒప్పుకోలు చేయగలిగింది.

రైతుకూలీ ప్రజాభ్యుదయానికై కృషి కొనసాగించేందుకు రంగాజీ సంపూర్ణారోగ్యంతో శతాయుస్సంపన్నులు కావాలని ఆకాంక్ష.



''చదువు సంధ్యలేల సంస్కృతి లేకున్న
వ్రాత కోత లేల నీతిలేక
తెలివితేట లేల విలువలు లేనిచో
నవయుగాల బాట నార్లమాట'' — శ్రీ నార్ల

''చెమట నోడ్చి నరుడు జీవింపదగు గాని
తేరసొమ్ము మెక్కి త్రేపరాదు'' —'తెనుగులెంక' శ్రీ తుమ్మల

# రైతు రంగా

ఉప్పుమాములూరి వెంకటచక్రవర్తి

గాంధీయుగం మట్టిలోనుండి పుట్టిలో నుండి మాణిక్యాలను సృష్టించింది. పరప్రభుత్వాల పాలన నుండి వ్యతిరేకంగా భారత ప్రజల దాస్యశృంఖలాలను త్రుంచివేసేటందుకు మహాత్మాగాంధీ సాగించిన మనో యజ్ఞంలో ఎందరో మహానాయకులు ఉద్భవించారు. అట్టి వారిలో ఆచార్యరంగా ప్రముఖులు. వారు స్వాతంత్ర్య సమరంలో మహాత్మాగాంధీ నేతృత్వాన జరిగిన సహాయ నిరాకరణోద్యమం శాసనోల్లంఘన సత్యాగ్రహ సమరాలన్నిటిలోను పాల్గొని పలుసార్లు గాంధీజీతోపాటు లాఠీ చార్జిలు జైలుశిక్షలు సహనంతో సంతోషంతో అనుభవించిన అహింస అభ్యుదయభావాలుగల గాంధేయవాది.

తాను మాతృదేశానికి అంకితమై తన బంధుమిత్రులను ప్రజను త్యాగశీలురుగా దేశభక్తులుగా తీర్చిదిద్దిన ధైర్యశాలి. వీరితోపాటు వీరి సతీమణి భారతీదేవి. రంగాగావించిన త్యాగం నిరుపమానమైనది.

గాంధీ ఆదేశాల ననుసరించి అనేక గురుతర బాధ్యతలను సమర్థవంతంగా నిర్వర్తించి గాంధీజీ ప్రముఖ నాయకులతో ప్రశంసలందుకొని నిర్మాణ కౌశల్యముతో దీక్షాదక్షతలతో ప్రజలలో చైతన్యం కల్గించి రైతురంగాగా ఘనతకెక్కాడు. స్వరాజ్యం కోసం అహర్నిశలు పరితపించి పోరాడిన ఆచార్య యన్. జి. రంగావంటి ఆంధ్రా స్వాతంత్ర్య అహింసాయోధుల సేవలను స్మరించుకొనుట మనవిధి. ఆంధ్ర రాజకీయ చరిత్రలో నాలుగు దశాబ్దాలపాటు అత్యంత ప్రముఖ పాత్ర వహించిన ఆచార్య రంగా భూసంస్కరణల విషయంలోను రైతు సమస్యలలోను సహకార వ్యవసాయ విధానమునందు పారిశ్రామిక కార్మిక వివాద పరిష్కారములందును కాంగ్రెస్ సామ్యవాద సమాజ నిర్మాణ అవశ్యకత విషయములలోను నిష్కర్షంగా. నిర్భయంగా, నిర్మొహమాటంగా మహాత్మాగాంధీ ఆశయాలను కాంగ్రెస్ సిద్ధాంతములను వాడవాడలా అందించిన మహానాయకుడు.

స్వాతంత్ర్యసమరయోధుడు రైతు నాయకుడుగా ప్రముఖ కాంగ్రెస్ కార్యకర్తగా ఆంధ్రదేశానికి వారు చేసిన సేవ చిరస్మరణీయమైనది. ఆంధ్రప్రదేశ్‌లో వారు భీష్మాచార్యులాంటివారు అనుటలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. ఆయనలోని ముక్కవోని ధైర్య సాహసం, నిర్మొహమాటం, రైతు సోదరులపై గల ప్రేమాభిమానములు ప్రతివారికి పరిచితమే.

మరో పర్యాయం మహాత్మాగాంధీగారి నాయకత్వం దేశానికి సమకూరిననాడే ఆచార్య రంగాగారి లాంటి నాయకులు దేశానికి లభ్యంకాగలరు. ఆంధ్ర రాష్ట్ర స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గుంటూరుజిల్లాకే విశిష్టమైన స్థానం ఉంది. గుంటూరుజిల్లాలో రైతు రంగాకి ప్రముఖస్థానం ఉంది. శ్రీ ఆచార్య రంగాగారు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణ, భోగరాజు పట్టాభి సీతారామయ్య, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు, బులుసు సాంబమూర్తి వంటి దేశనాయకుల కోవకు చెందిన ఆచార్య రంగా నాయకత్వమునుగాని. పదవులనుగాని ఆశించక కాంగ్రెసు సంస్థకి గొప్పసేనానిగా మహాత్మా గాంధీ అడుగుజాడలలో తన జీవితమంకితమొనర్చెను.

పదవులు వాటంతట అవే వరించి పదవులకే గౌరవము తెచ్చినవి. రాజకీయాలకు రైతు సమస్యలకు సాధ్య మొనర్చిన ఆరోజులు గుర్తుతెచ్చుకుంటే ఎన్నో సంఘటనలు గుర్తువస్తున్నాయి. ఏమైనా ఆరోజులు ఎక్కడ? ఎంత తారతమ్యం? ప్రజాసమస్యల కొరకు పోరాడిన ధీరులను తలచుకొను అవకాశం కల్గినందుకు ఆచార్య రంగాగారి 89 వ జన్మదినోత్సవమే కాదు. ఆయన నిండు నూరేళ్ళ జన్మదిన వేడుకలు జరుపుకోవాలని, జరుపుకుంటారని ఆకాంక్షిస్తూ శుభాకాంక్షలందిస్తున్నాను.

## రైతు రంగా !

ఆచార్య ఎన్.జి. రంగాకి రైతురంగా అనేపట్టం ఊరకే రాలేదు. వారి కార్మిక, కర్షక, శ్రామిక సోదరుల కోసం, నిస్వార్థసేవ, ఆత్మవిశ్వాసం, ధైర్య సాహసాలను ఆంధ్రరాష్ట్ర అవతరణ కోసం రంగా సాగించిన నిరంతరసేవ సమ్మానపాత్రమైనదనుటలో సందేహమే లేదు. రాష్ట్రం వొచ్చింది. విశాలాంధ్ర పటిష్ఠమైనది. ఈ తరుణంలో ఆచార్యరంగా 89వ జన్మదినోత్సవమున కృతజ్ఞత కమల కుసుమాంజలి సమర్పించుట మన ధర్మం, భాగ్యం కూడా.

లాఠీల దెబ్బల లక్ష్యపెట్టక యుప్పు
సత్యాగ్రహంబును జరిపినాడు
పైవారి అదుపుల పాటించకయే దుష్ట
శక్తుల నరికట్ట సాగాడు
సత్యాగ్రహమొనర్చి సరిసాటివారితో
జైలులోపల నుండసాగినాడు
అధికార వ్యామోహ మరికట్ట తీండ్రించి
ముందడుగును వైచి పోవునేడు

నాడునుగూడ యే గోడు కొంటలో
జీవితము ధారవోయుచు సేవజేయు
రైతురాజు ఆచార్య రంగ కాదే
రైతురంగ బిరుదుకు అర్హుడిలదే

పట్టుబట్టిన వీడని దిట్టవీవు
గాంధితత్వంబె నిన్నింత ఘనునిజేసె
నిన్నెరుంగరయే యేమేమో పనుచుంద్రు
దేశజనవారె చెల్లుట స్థిరము రైతురాజా!

(O)

'దప్పిగొన్నట్టి వానికా దప్పిదీర్ప సలిల పూరంబు హితమౌ ఆజ్యంబు హితమౌ?' -శ్రీనాథుడు

కలకంఠి కంట కన్నీరొలికిన సిరి యింటనుండ నొల్లదు సుమతీ ! —బద్దెన

చేయెత్తి జైకొట్టు తెలుగోడా !
గతమెంతో ఘనకీర్తి కలవోడా ! — వేములపల్లి

స్నేహితునికోసం ప్రాణం ఇవ్వడం అంత కష్టమేమీ కాదు. అంతటి త్యాగానికి అర్హుడైన స్నేహితుడు లభింపడం కష్టం. —హోమ్

# నివేదన

'బాలబంధు' బి. వి. నరసింహారావు

రంగాజీ :

కాలం తీరం గడిచిన మీరు
తీరం తీరం తిరిగిన వారు
వయోవృద్ధులు, జ్ఞాన సమృద్ధులు,
ఆచార్యులు, ధర్మ విచారులు
ఎనుబది తొమ్మిది వసంతాలు
ఎంతో విలువగ వెలయించారు.

కాలం తీరానున్న వీరలు
ఘనముగ మీ పుట్టిన పండుగ
అంకేగాక భారతీరంగా మీ
యనుంగు పత్ని స్మృతి చిహ్నంగా
నెలకొల్పిన వసతి గృహానికి
విస్తులానంద తుందిలంగా
ప్రారంభోత్సవం జరిపించుట
విక్కముగా ఈ కళాశాల
జీవితాన ఒక సువర్ణఘట్టం

చల్లని మీ పవిత్రహస్తం చాచి
సర్వ సమృద్ధిని సాధించుటకై
దీవించండి ఈ విద్దెల తల్లిని
భావించండి హృదయ పూర్ణముగ

## రైతు బాంధవులు - రాజకీయ ధురంధరులు

## పూజ్య శ్రీ రంగాజీకి 89వ జన్మదినోత్సవ సందర్భంగా

## అ క్ష ర సు మాం జ లి

స్వాగతం సుస్వాగతం
మా రైతు రంగా
నూరేండ్లు వర్ధిల్లు
నీవు శుభంగా !

పదవి కోసము గాక
ప్రజల కోసము నిలిచి
నిజ నాయకునిగా
నీరాజన లందావు !

ఆచార్య పట్టమ్ము
అందిరాగా నీవు
రాజకీయము లోకి
రైతుగా వచ్చావు !

అమ్మ "భారతిదేవి"
మిమ్ము విడిపోయిన
మా సేవ నేటికి
సరి నీవు చేశావు !

స్వతంత్ర సమరాన
సతి "భారతి"తో కలిసి
అతులిత త్యాగాలు
అసలెన్నో చేశావు !

పుణ్యమూర్తివి నీవు
ధన్యజీవివి నీవు
అందుకో నీ కిదే
అక్షర సుమాంజలి!!

స భా వే ది క
శ్రీ రామా రూరల్ కళాశాల,
చిలుమూరు.

స మ ర్ప ణ
నా గ ళ్ళ రా ధ
అనంతవరము

5)

# "ఆరు దశాబ్దాల ఆదర్శ నాయకుడు ఆచార్య రంగాజీ"

ఆచంట రంగనాయకులు, అడ్వొకేటు
స్వాతంత్ర్య సమరయోధుడు-మాజీ, ఎం. ఎల్. సి.

భారతదేశం గర్వించదగ్గ జాతీయ నాయకులలో ఆచార్య రంగాగారు ఒకరు స్వాతంత్ర్య సమరయోధుడిగా, రైతు, కూలీ జనబాంధవుడుగా అంతర్జాతీయస్థాయిలో అద్వితీయమైన గుర్తింపును పొందినవ్యక్తి ఆయన. ఊహ తెలిసిన నాటినుండి తన సర్వస్వాన్ని భరతమాత సేవకోసం సహర్షంగా సమర్పించిన త్యాగశీలి. ఆరు దశాబ్దాలకు పైగా అకుంఠితదీక్షతో, మానవస్ఫూర్తితో, రైతు, కూలీ బడుగువర్గాల సమస్యల్ని పరిష్కరించటానికి అహర్నిశలు కృషి చేస్తున్న ఋషితుల్యుడు శ్రీరంగాజీ.

## స్థిర సంకల్పుడు :

తన లక్ష్యాన్ని సాధించటానికి, ఎన్ని కష్టనష్టాలనైనా భరించటానికి, గమ్యం చేరుకునే వరకు పరిశ్రమించటానికి సర్వసన్నద్ధులుగా వుండే స్థిరసంకల్పం- ఆచార్య రంగాగారి వ్యక్తిత్వంలో చెప్పుకోతగిన విశేషం, పదవులకోసం ఆశపడకుండా, వీరే పార్టీలు స్థాపించి అయినా పోరాడే స్థిరసంకల్పుడు ఆయన. బడుగు వర్గాలవారికి రంగాజీ ఒక ఆశాజ్యోతి. 1923వ సంవత్సరములోనే వ్యవసాయ కూలీ మహాసభలను నిడుబ్రోలులో నిర్వహించి ఆచార్య రంగాజీ విప్లవాత్మక శంఖారావాన్ని వినిపించారు. ఆర్థిక, సాంఘికరంగాలలో బీదజనులకు తగినన్యాయం చేకూర్చాలన్నదే వారి ఆశయం. గ్రామీణ ప్రజలకు సేవచేయాలనే సదుద్దేశంతోనే ఆచార్య రంగాగారు తన ప్రాణాన్ని సైతం పణంపెట్టి, రాత్రింబవళ్లు ఎన్నోవ్యయ ప్రయాసలకు లోనై ఒడుదుడుకులను తట్టుకొని, భారత రాజకీయ రంగాలలో అగ్రస్థానాన్ని అందుకున్నారు. అశేష ప్రజానీకంలో విశేషమైన కీర్తిని సంపాదించుకున్నారు. ఆయన మచ్చలేని మహామనిషి పేదరికంలో మగ్గిపోతున్న రైతుకూలీల జీవితాలను చైతన్యవంతం చేయటానికి, వృత్తివిద్యల ద్వారా వెనుకబడిన వర్గాలకు హరిజన, గిరిజనులకు చేయూత నివ్వడానికి అనేక ఆచరణ యోగ్యమైన పథకాలను రూపొందించినమానవతావాది. అంతేకాదు. స్త్రీస్వాతంత్ర్యానికి పిలుపునిచ్చి, మానవత్వమే ప్రాతిపదికగా మహిళాభ్యుదయానికి స్వాగతం పలికిన సమదర్శి శ్రీరంగాజీ తమ ధరపత్ని శ్రీమతి భారతీదేవి రంగాజీని ఆదర్శ భారతీయ మహిళా రత్నంగా, వాసికెక్కిన నాయకురాలిగా, తీర్చిదిద్దినారు.

## సిద్ధాంత కర్త :

భారతదేశ ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను అవగాహన చేసుకొని, రైతుకూలీ ప్రజాస్వామ్యము మన ఆదర్శమని చాటిచెప్పిన సిద్ధాంతకర్త ఆచార్య రంగాజీ. స్వాతంత్ర్య సమరం సాగుతున్న రోజులలోనే మనం పొందే స్వరాజ్యం "సురాజ్యం" కావాలని ఆయననొక్కి చెప్పినాడు. ఆ లక్ష్యాన్ని సాధించుకోటానికి అందరు కలసికట్టుగా కృషిచేయాలన్నది ఆయన అభిమతం. ఆచార్య రంగాజీ ఆలోచనలు, ఆశయాల్లోని అంతర్యాన్ని అర్థంచేసుకున్న దాపూజీ తన ఆశీస్సులను అందించారు. ఈధోరణికి భిన్నంగా వుండే సోవియట్ కమ్యూనిష్టులు పనికిరాని నిరంకుశ విధానంతో అవలంబించే పద్ధతులు సత్ఫలితాన్ని సమకూర్చలేవని ఆయన స్పష్టంగా వ్యక్తపరచినారు. ఆనాడు కృశ్చేవ్ తలపెట్టిన కొద్దిప్రయత్నాలు ఈనాడు 71సంవత్సరముల తర్వాత గోర్బచేవ్

సాధించిన ప్రజాస్వామ్య ప్రగతి ఆచార్యరంగాగారి ఆలోచనా సరళికి కొద్దిగానైనా దగ్గరగారావటం ఎంతైనా ముదావహమైన విషయం. భవిష్యత్తును సరిగా అంచనా వేయగలిగిన దూరదర్శి కావటం వలన ఆయన. రైతాంగపు ఆక్రందనాలకు చలించి పోయారు. ముందు చూపుతో విధానాలను వ్యతిరేకించి తన మానవతా దృక్పధాన్ని నిరూపించుకున్నారు. ఈసందర్భంలో ఆయన పండిట్‌తో నెహ్రూజీతో విభేదించటానికికూడా వెనుకాడలేదు. వ్యక్తిగతంగా అనురాభిమానాలు పుష్కలంగా వున్నా, సిద్ధాంతాలలో, లక్ష్యసాధనాలలో వారి మార్గాలు కొంతభిన్నంగా మారాయి. ఆచార్య పీఠాన్ని అలంకరించిన రంగాజీ అధికార పీఠానికి దూరమయ్యారు. నాటి నాయకుల ధోరణికి, తన ధోరణికి పొంతన కుదరదని తెలుసుకున్న రంగాజీ రానున్న అధికారాలను, పదవులను పరిత్యజించి లక్ష్యసాధనకు కంకణం కట్టుకున్నారు.

## అనధికార భారత రాయబారి :

విశాల దృక్పథంలో అంతర్జాతీయ సమస్యలను అర్థంచేసుకొని రంగాగారు ఎప్పటికప్పుడు ప్రజాసేవకు, శాంతిసాధనకు ప్రపంచ స్థాయిలో జరుగవలసిన కృషికి ఎన్నోమార్గాలను సూచించినారు. విశ్వవేదికపైన రైతుకూలీనాయకునిగా విశిష్టమైన స్థానాన్ని పొందగలిగారు. అంతర్జాతీయ రంగంలో చొరవచూపి, అనేక సమస్యల పరిష్కారానికి, సముచితమైన సలహాలను, సూచనలను చేసిన అనధికార భారతరాయబారి. ఆయన మానవత్వపు మనుగడయే మంచి పునాదులువేసిన పుణ్యమూర్తి ఆచార్యరంగాజీ. ఉదాత్తమైన భావాలతో, ఎన్నో ఉత్తమమైన గ్రంథాలను రచించి, అనేక జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై తన ఆలోచనా సరళిని, నిర్దుష్టంగా వ్యక్తపరచిన రచయిత ఆయన. ప్రత్యేకించి తెలుగులో రంగాజీశైలి ప్రసన్నమైనది. సరసమైన ఒక బాణీలో ఆయన వ్రాసే విధానం అందరినీ ఆకట్టుకొంటుంది.

## నిజమైన ప్రజాప్రతినిధి :

అధికార, అనధికారపక్ష నాయకునిగా ఆరు దశాబ్దాలకుపైగా ప్రజాస్వామ్య పరిరక్షణకు, పార్లమెంటరీ సంప్రదాయాల పరిపోషణకు, ఆయన అందిస్తున్న సేవలు కొనియాడతగినవి. ఇంత సుదీర్ఘకాలంగా దేశసేవలో పాలుపంచుకొనే అవకాశం కలిగిన నాయకులు ప్రపంచ చరిత్రలోనే అరుదు. ఆచార్య రంగాజీ నిజమైన ప్రజాప్రతినిధి. తనునమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి ఒంటరిగానైనా తన లక్ష్యసాధనకు ఉద్యమించే అకుంఠిత దీక్ష ఆయనది. ముఖ్యంగా రైతుకూలీ సంక్షేమానికి ఆయన చేసిన కృషి వర్ణనాతీతము భారతదేశంలోనే ప్రపథమంగా 1934లో రైతాంగ విద్యాలయాన్ని నిడుబ్రోలులో స్థాపించి, మహాత్ముని చేతులమీదుగా ఆ సంస్థను ఆవిష్కరింప చేసి ఎందరో రాజకీయనాయకులకు చక్కటి శిక్షణ అందించిన ఘనత ఒక్క రంగాజీకే దక్కుతుంది. "రంగాజీ పార్లమెంటులో వున్నంతవరకు రైతు సమస్యల్ని గురించి మరచిపోవటం జరగదు" అన్న నెహ్రూజీ మాటలు నిజమైన ప్రజాప్రతినిధిగా ఆచార్యరంగాగారి విలక్షణమైన వ్యక్తిత్వానికి మచ్చుతునకలు.

ఇంతటి మహనీయుడైన రంగాజీ 89వ జన్మదినోత్సవం భారత ఉపాధ్యక్షులు ప్రముఖుల దేశభక్తి పరాయణులు గౌ॥ శ్రీ శంకరదయాల్‌శర్మగారి అధ్యక్షతన చిలుమూరులో జరుగుట ఎంతో హర్షించదగిన విషయం. ఈ సందర్భంగా యింతటి మహత్తర కార్యక్రమాన్ని సహృదయంతో నిర్వహిస్తున్న ఆదర్శ రామా రూరలు విద్యాలయంవారు, ప్రత్యేకించి కొలసాని మధుసూదనరావుగారు శతధా అభినందనీయులు.

: జైహింద్ :

# " ఋషుల కోవకు చెందు గాంధీ నీవు "

— సోంపల్లి జానయ్యా చౌదరి

సీ॥ రూపము జూతుమా ఋషుల కోవకు చెందు
ఖద్దరు వలువల గాంధి నీవు
పలుకులు విందుమా పటుతర శక్తులు
పొదిలిన భావముల్ పొంగి పొరలు
పలుకరించితి మమా పాడిపంటల తీరు
ఆత్మబంధువు రీతి అడుగ గలవు
తలపడ జూతువా తగువారి నెదిరించ
సిద్ధాంత సరళితో సిద్ధమీవు

తే॥గీ॥ అర్ధశాస్త్రము తెలిసిన అద్వితీయ
దేశదేశాలు తిరిగిన ధీ విశాల
మిమ్ము నెదిరించి వంచగ మిథ్య గాదె
ఎనుబదెన్మిది నిండిన ఏండ్లు వచ్చె

ఉ॥ రాబడి లేని జీవితము రాజుల రందని పూజితమ్ములే.
లోబడ కేరికిన్ నిజము లోకము నాకము కందజేసి, మీ
రేబది యేండ్ల సేవలతో ఎందరి మన్నన లందుకొంటిరో
మీబడి అబ్బెనా ! భువిలో మీకును మాకును కీర్తిఅబ్బువే!

తే॥గీ॥ పూర్ణ ఆరోగ్య భాగ్యంపు పూజలంది
నిండు గుండెతో భువిలోన నిలిచియుండ
చరిత పుటలన్ని మీకథ సారమెక్కు
రంగ రంగాల, మారంగ, రంగ నేత.

# కాంగ్రెస్ రాజకీయాలలో మద్రాసు రాష్ట్రం పాత్ర

ఆచార్య ఎన్. జి. రంగా

తెలుగువారికి ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటయ్యే వరకు, అంటే 1955వ సంవత్సరం వరకు మద్రాసు నగరం దక్షిణ భారతదేశం మొత్తానికి రాజకీయ పరంగాను, పరిపాలనాపరంగానుకూడా రాజధానిగా వున్నదని పేర్కొనవచ్చు. నిజానికి స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వం వహించిన కాంగ్రెస్ పార్టీ ఏర్పాటుకు ముందునుంచే అప్పటి మద్రాసు రాష్ట్రం ఎంతో చైతన్యవంతంగా వుండేది. కాంగ్రెస్ పార్టీ ఏర్పాటుకు ఒకటి, రెండు సంవత్సరాలముందు లక్ష్మీనరసుచెట్టి వంటివారిచే ప్రారంభించబడిన మద్రాసు మహాజనసభ రాయలసీమ ప్రాంతంలో నెలకొన్న దుర్భిక్షంవల్ల అక్కడి ప్రజలపట్ల బ్రిటిష్ పార్లమెంట్ బాధ్యత ఏమిటో గుర్తుచేసేది. విద్యారంగానికి సంబంధించి బ్రిటిష్ మిషనరీల గుత్తాధిపత్యాన్ని మన దేశంలో కొనసాగనీయరాదనే ఉద్దేశంతో పచ్చియప్పముదలియార్ పెద్దసంఖ్యలో పాఠశాలలను ప్రారంభించారు. ఆ పాఠశాలలలో కొన్ని ఆ తరువాత కళాశాలల స్థాయికికూడా ఎదిగాయి.

ఇక దేశానికి స్వాతంత్ర్య సముపార్జనకు ఒక జాతీయ వేదిక నిర్మాణము అవసరమనే ఆలోచనతో, ఆ కృషిలో భాగంగా వివిధ రాష్ట్రముల రాజధానులను సందర్శిస్తూ మద్రాసు వచ్చిన సురేంద్రనాథ్ బెనర్జీ మద్రాసు మహాజన సభనుంచి లభించిన ప్రోత్సాహాన్ని చూసి, లక్ష్మీనరసుచెట్టి, గోవిందాచారి వంటివారి నుంచి లభించిన ఆదరాన్నిచూసి ఇంతటి అండదండలు లభిస్తున్నప్పుడు తాను అనుకున్న లక్ష్యాన్ని సాధించడం పెద్ద కష్టం గాదని అభిప్రాయపడ్డారు. శ్రీమతి అనీబిసెంట్ హోమ్‌రూల్ ఉద్యమాన్ని మద్రాసునుంచే ప్రారంభించారు.

1920లో దేశ వ్యాప్తంగా ప్రారంభమైన సహాయ నిరాకరణోద్యమంలో కాని, 1923-39 సంవత్సరాల మధ్య కౌన్సిల్స్‌లో ప్రవేశం విషయంలో కాని మద్రాసు రాష్ట్రం గొప్ప చారిత్రాత్మకమైన పాత్రను నిర్వహించింది. అటు నిర్మాణాత్మక కార్యక్రమాలలోను, ఇటు బహిష్కరణోద్యమాలలోనుకూడా రాజాజీ ఆదర్శవాదిగా వ్యవహరించారు. ఇక పార్లమెంటరీ వ్యవహారాలలో సత్యమూర్తి నిర్వహించిన పాత్ర చాలా గొప్పదని చెప్పుకోవాలి. అదేవిధంగా, అట్టడుగు వర్గాలనుంచి ఎదిగివచ్చి కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష స్థానాన్ని అందుకున్న నిరాడంబరజీవి, త్యాగశీలి కామరాజ్‌నాడార్ కూడా మద్రాసు రాష్ట్రానికి చెందిన వ్యక్తే. ఆయన స్వాతంత్ర్యానంతరం మద్రాసు రాష్ట్రాన్ని పరిపాలిస్తున్న కాలంలో ఒకవైపు సమాజంలోని ఉన్నత వర్గాల కోపానికి గురవుతూ, మరోవైపు పెరియార్ రామస్వామి నాయకర్ సాగిస్తున్న కాంగ్రెస్ వ్యతిరేక ఉద్యమాన్ని చిరునవ్వుతో ఎదుర్కొంటూ, జవహర్‌లాల్ నెహ్రూ ఆశీస్సులతో మద్రాసు రాష్ట్రాన్ని అన్ని రంగాలలోనూ అభివృద్ధి పథంలో నడిపించిన కార్యదక్షుడు.

కాగా, 1857 స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖపాత్ర వహించినవారిపై దమన నీతిని ప్రయోగించిన బ్రిటిష్ జనరల్ విగ్రహాన్ని తొలగించాలంటూ మద్రాసులో చేపట్టబడిన సత్యాగ్రహ ఉద్యమం అక్కడ విజయవంతం కావడమేకాక కలకత్తాలోకూడా కొందరు బ్రిటిష్ జనరల్ విగ్రహాలను తొలగించవలసిన పరిస్థితులకు దారి తీసింది.

ఇక, ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రులకు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా దేశోద్ధా

రక కాశీనాథుని నాగేశ్వరరావు, రంగయ్యనాయుడు, టంగుటూరి ప్రకాశం పంతులు నాయకత్వం వహించేవారు. అదే విధంగా, కెప్టెన్ లక్ష్మి, దుర్గాబాయి, శ్రీనివాస అయ్యంగార్ కుమార్తె అంబుజమ్మాళ్ మొదలైనవారు మహిళలకు నాయకత్వం వహించేవారు. పోలీసులచేత లాఠీ దెబ్బలు తినడంలో ముందుగా పేర్కొనవలసింది "స్వరాజ్య" పత్రిక ఎడిటర్ ఖాసా సుబ్బారావును ఇద్దరు బ్రిటిష్ సార్జెంట్లు అలసిపోయే వరకు లాఠీలతో మోదుతున్నా ఆయన ఏ మాత్రం చలించలేదు. అలాగే హరిజనులకు దేవాలయ ప్రవేశం కల్పించడంలోకూడా ఈ రాష్ట్రం ఏ మాత్రం వెనుకబడలేదు. ముఖ్యమైన దేవాలయాలుగా పేర్కొనబడే మధుర, తిరుపతి వంటి దేవాలయాలలోకి హరిజనులకు ప్రవేశం కల్పించబడింది. మరో ముఖ్య విషయం ఏమిటంటే హిందీ ప్రచార సభకు ఆధ్వర్యం వహిస్తున్న మోటూరు సత్యనారాయణ కృషి ఫలితంగా లక్షలాది ప్రజానీకాన్ని హిందీ భాష వ్యతిరేకతకు దూరం చేసి భాషాపరంగా జాతీయస్రవంతిలోకి తీసుకురావడం జరిగింది.

ఇప్పటికి దాదాపు వంద సంవత్సరాల క్రితం కాంగ్రెస్ పార్టీ మూడవ సమావేశాలు మొదటి సారిగా మద్రాసులో జరిగాయి. ఆ తరువాత అక్కడ జరిగిన ఎ.ఐ.సి.సి. ప్రతి సమావేశంకూడా ఒక ప్రతేకతను సంతరించుకుంటూ జాతీయస్థాయి రాజకీయాలపై తన ప్రభావాన్ని ప్రసరింప చేస్తూనే వున్నది. ఉదాహరణకు అప్పటివరకు బ్రిటిష్ పాలనలో వుంటూనే భారత దేశానికి స్వతంత్ర్య ప్రతిపత్తి లభించినట్లయితే చాలునని భావిస్తూ వచ్చిన కాంగ్రెస్ పార్టీ 1927లో మద్రాసులో జరిగిన ఎ. ఐ. సి. సి. సమావేశాలలో సంపూర్ణ స్వాతంత్ర్య సాధన లక్ష్యంగాపనిచేయాలని నిర్ణయించుకున్నది. ఆ నిర్ణయం ఫలితంగానే 1930 లో లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్‌పార్టీ సమావేశాలలో "భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్య సముపార్జన తక్షణ జాతీయలక్ష్యము"ని ప్రకటించి, అందుకు చేపట్టవలసిన చర్యలను పేర్కొన్నది.

అప్పట్లో మద్రాసులో జరిగిన యువజన కాంగ్రెస్ సమావేశాలకు డాక్టర్ పట్టాభి అధ్యక్షత వహించగా, డాక్టర్ కోడిన్స్, ఈ వ్యాస రచయిత ఆ సమావేశాలను నిర్వహించడం జరిగింది. ఆ సమావేశాల దగ్గరి నుంచే స్వాతంత్ర్యోద్యమంలో కాంగ్రెస్ పార్టీ పోరాట పటిమకు బలాన్ని చేకూర్చే చర్యలను చేపట్టడం యువజన కాంగ్రెస్ ప్రారంభించింది.

ఇక, 1955లో మద్రాసు నగరానికి సమీపంలోని ఆవడి వద్ద జరిగిన ఎ.ఐ.సి.సి. సమావేశాలలోనే "సోషలిజం" సాధన లక్ష్యంగా కాంగ్రెస్ పార్టీ ఒక తీర్మానాన్ని ఆమోదించడం జరిగింది.

కాగా, ప్రకాశం పంతులు ముఖ్యమంత్రిగా వున్న రోజులలో గాంధీజీ విధానాల అమలుకు కృషి చేస్తున్న ఆయనకు అసమ్మతి వర్గం చేపట్టిన కార్యకలాపాల కారణంగా ఆ పదవి నుంచి తొలగించడానికి కాంగ్రెస్ నాయకులు తమ అనుమతిని ప్రసాదించారు. గాంధీజీ ప్రబోధించిన విలువలకు తిలోదకాలు ఇస్తూ తీసుకున్న ఆ నిర్ణయాన్ని అప్పట్లో స్వాతంత్ర్య సమరయోధులంతా తీవ్రంగా వ్యతిరేకించారు. అదే విధంగా ఆంధ్ర ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీలో కొందరు సభ్యులను ఓటు చేయకుండా చేసి తమవారిని నాయకత్వ స్థానాలకు ఎన్నిక చేసుకోవాలనే ఉద్దేశంతో కొందరు సభ్యులను అనర్హులుగా చేయడానికి కోర్టులకు వెళ్ళడానికి ఒక వర్గం ఒడిగట్టినా అధిష్ఠానవర్గం వారి యత్నాన్ని నిరోధించకపోవడంతో ప్రకాశం, ఈ వ్యాస రచయిత ఇద్దరు కాంగ్రెస్ పార్టీకి రాజీనామా చేశారు. ఫలితంగా 1952 ఎన్నికలలో మద్రాసు శాసనసభలో కాంగ్రెస్ పార్టీ మెజారిటీకి నష్టం వాటిల్లింది.

అప్పుడు స్వతంత్ర భారత దేశంలో మొదటి సారిగా మద్రాసు రాష్ట్ర ప్రభుత్వాన్ని కమ్యూనిస్టులు హస్తగతం చేసుకునే పరిస్థితి తలెత్తడంతో తాము చేసిన తప్పిదాన్ని తెలుసుకున్న కాంగ్రెసపార్టీ జాతీయ నాయకులు కిసాన్-మజ్దూర్ పార్టీ అధ్యక్షుడుగా వున్న ప్రకాశాన్ని, కృషికార్ లోక్ పార్టీ అధ్యక్షుడుగావున్న ఈ వ్యాస రచయితను సహకారం కోరారు. అప్పుడు నిజాయితీకి, సామర్థ్యానికి మారుపేరైన రాజాజీకి (ఆయన అప్పటికే అన్ని పదవులను వదలివేసి విశ్రాంతి తీసుకుంటున్నారు) కాంగ్రెస్ లెజిస్లేచర్‌పార్టీ నాయకత్వం అప్పగించ వలసివదిగాను, అప్పుడు కృషికార్ లోక్ పార్టీ ఆ మంత్రివర్గానికి మద్దతు ఇస్తుందని ఈ వ్యాస రచయిత సలహా ఇవ్వడం జరిగింది. ఆ సంకీర్ణ ప్రభుత్వానికి మద్దతు ఇవ్వడానికి ప్రకాశం వ్యతిరేకించినా కృషికార్ పార్టీ మద్దతుతో శాసనసభలో కాంగ్రెస్ పార్టీకి మెజారిటీ చేకూరడంవల్ల భారత దేశంలో మొట్టమొదటసారిగా ఒక రాష్ట్రంలో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడటమే కాక, కమ్యూనిస్టులు అధికారానికి వచ్చే అవకాశాన్నికూడా అప్పటికి పోగొట్టడం జరిగింది. రాజాజీ నాయకత్వంలో ఏర్పాటయిన ప్రభుత్వం ఎంతో సమర్థవంతముగా పనిచేయడవల్ల గాంధీజీ ప్రవచించిన విధానాల అమలును సాధించినట్టు కావడమే కాక, సంకీర్ణ ప్రభుత్వాన్ని విజయవంతంగా నడిపించవచ్చుననికూడా మొదటిసారిగా రుజువుచేయడం జరిగింది.

ఇక శ్రీ పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ ఫలితంగా 1953లో ఆంధ్రరాష్ట్రం ఆవిర్భవించింది. అయితే, అందుకు అది కొంత మూల్యం చెల్లించవలసి వచ్చింది. సమిష్టినగరమైన మద్రాసును తమిళులకు ఇవ్వవలసి వచ్చింది.

ఆంధ్ర అసెంబ్లీలో అన్ని పార్టీల కంటె పెద్ద పార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీకి ప్రభుత్వం కైవసం అయ్యేటట్టున్నది.

మిశ్రమ మంత్రివర్గంతో భాగస్వాములుగా ప్రకాశంగారి ప్రజాపార్టీ, మా కె.ఎల్.పి., కాంగ్రెస వుండాలని; ఆ మిశ్రమ ప్రభుత్వానికి "ఆంధ్రకేసరి" ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా వుండాలని నేను శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి ద్వారా ప్రధాని నెహ్రూను ఒప్పించాను. ఆ తర్వాత ఆంధ్ర రాష్ట్రంలో ప్రజాస్వామ్యాన్ని పటిష్టం చేయడానికి నేను కాంగ్రెస్‌లో చేరాను.

భారతదేశంలో ఆహారధాన్యాల విషయంలో స్వయంపోషకం కావాలన్న పట్టుదలతో జవహర్‌లాల్ నెహ్రూ నిర్బంధ సహకార వ్యవసాయ విధానాన్ని చేపట్టాలని నిర్ణయించడంతో నేను 1957-59 లో కాంగ్రెస్‌తో విభేదించాను.

మన రైతులకు గిట్టుబాటయిన ధరలు చౌక ధరలకు ఎరువులు, ఇతర వ్యవసాయ పరికరాలు ఇచ్చినట్టయితే, దేశాన్ని వ్యవసాయరంగంలో స్వయం పోషకం చేయగలరని నేను ఎంత విజ్ఞప్తిచేసినా ఆయన వినలేదు.

అందువల్ల సహకార వ్యవసాయాన్ని జాతీయోద్యమంగా చేయాలన్న నాగపూర్ కాంగ్రెస్ తీర్మానానికి నిరసనగా నేను కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ కార్యదర్శి పదవి నుంచి రాజీనామా చేశాను.

తరువాత నేను రాజాజీతో కలిసి స్వతంత్ర పార్టీని స్థాపించాను. రైతులను వారి వమతాలనుంచి తొలగించి, వారిని రష్యాలోని రైతులవలె దాసులను చేసే సహకార వ్యవసాయ విధానాన్ని ఎదుర్కొనడానికి నేను అలా చేయవలసి వచ్చింది. అలా సంవత్సరాల తరబడి రాజాజీతో కలసి నేను స్వయం ఉపాధితో జీవిస్తున్న రైతుల తరఫున ప్రభుత్వంతో పోరాడాను.

అయితే, 1964 వచ్చేసరికి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ సహకార వ్యవసాయ విధానాన్ని జాతీయో-

ద్యమం చేయాలన్న తన నిర్ణయాన్ని మార్చుకొని, రైతులు తమ వ్యక్తిగత కమతాలను అట్టిపెట్టుకొనడానికి అంగీకరించిరి.

కాగా, భారతీయ ప్రజాస్వామ్యంలో తమ రాజకీయ దృక్పథం ఎలావుండాలన్న విషయంలో స్వతంత్ర పార్టీలోని రైతువర్గం నిర్ణయించుకోవలసిన తరుణం వచ్చింది.

1969-70 వచ్చేసరికి శ్రీమతి ఇందిరాగాంధీ "గరీబీ హటావో" కార్యక్రమాన్ని రూపొందించి, దాని అమలుకు ప్రభుత్వం ఆధ్వర్యంలోని వనరులను వినియోగించాలని నిర్ణయించారు. ఒకప్రక్క కాంగ్రెసేతర పార్టీలు, కాంగ్రెస్‌లోని అసమ్మతివాదులు ప్రతిఘటిస్తున్నప్పటికి, మన ఓటర్లను ముఖ్యంగా రైతులలోని అత్యధిక సంఖ్యాకులు ఆమెను, ఆమె కార్యక్రమాన్ని బలపరచడానికి నిర్ణయించుకున్నారని నేనుగ్రహించాను.

పెక్కుమంది రైతాంగ ఉద్యమ నాయకులతో కలసి కాంగ్రెస్‌లోని రైతు వర్గాన్ని బలపరచాలని నిశ్చయించుకున్నాను. "ఇందిరా హటావో" నినాదాన్ని ప్రజలు తిరస్కరించారని, అందువల్ల "గరీబీహటావో" అన్న నినాదాన్ని నిజమైన ప్రజాస్వామిక వాదులుగా మనం బలపరచాలని నేను రాజాజీకి చెప్పాను.

ఆ ప్రాంతాలలోనే అంటే, 1972,74 ప్రాంతాలలో అంతవరకు మద్రాసు అసెంబ్లీలో నాన్-కాంగ్రెస్ పార్టీల సహకారముతో మెజారిటీ సంపాదించడంలో తాపత్రయపడుతూ వచ్చిన డి. ఎం. కె. కూడా కాంగ్రెస్‌తో సహకారానికి ముందుకు వచ్చింది. ఎందువల్లనంటే, శ్రీమతి ఇందిరా గాంధి "గరీబీ హటావో" ఉద్యమం షెడ్యూల్డ్ తరగతులు, వెనుకబడిన వర్గాల దారిద్ర్యాన్ని నిర్మూలించడానికే ఉద్దేశించబడిందని స్పష్టమైంది.

ఇక, తమిళనాడు రాజకీయ రంగానికి వస్తే, వెనుకబడిన వర్గాల నాయకుడు, మహా దేశభక్తుడు అయిన శ్రీ అన్నాదురై 1967లో కాంగ్రెస్ నుంచి అధికారాన్ని లాక్కొని, సాంఘిక కార్యక్రమాలను అమలుజరుపటానికి కృషిచేస్తూ వచ్చారు.

అయితే, కమ్యూనిస్టులు, మతతత్వ వాదులైన ముస్లింలీగ్ వంటి నాన్-కాంగ్రెస్ పార్టీలపై ఆధారపడడం మంచిది కాదని డి.ఎం.కె. గ్రహించింది. అన్నాదురై మొదటి వారసుడు కరుణానిధి, రెండవ వారసుడు ఎం.జి.ఆర్. "గరీబీ హటావో" కార్యక్రమం కింద లభించే నిధులతో కాంగ్రెస్ సహకారంతో తాము తమిళనాడు ప్రజా సామాన్యం అభ్యున్నతిని సాధించ వచ్చునని భావించారు.

పచ్చయ్యప్ప కాలేజిలో శ్రీ అన్నాదురై విద్యార్థిగా వున్నప్పుడు ఆయనతో నాకు సన్నిహిత సంబంధాలు వుండేవి. తరువాత ఆయన ముఖ్యమంత్రి అయిన పిదపకూడా ఈ సంబంధం కొనసాగింది. అదే విధంగా అన్నాదురై గురువు ఇ. వి. రామస్వామి నాయకర్, వరదరాజులు నాయుడు, కామరాజ్ నాడార్ ఎం.జి.ఆర్. అంతకుపూర్వం పెద్దలైన సత్యమూర్తి రాజాజీ మొదలైనవారితో కూడా నాకు సుహృద్భావ పూర్వకమైన సంబంధాలుండేవి.

ముత్తురామలింగథేవర్, ఆర్.వి. స్వామినాథన్. రామస్వామిరెడ్డియార్ మొదలైన నాయకులు కలిసి కిసాన్-మజ్దూర్ ఉద్యమంలో పనిచేశారు.

తమిళ ప్రజలు, పండితులు రాజాజీ, సుబ్రహ్మణ్య భారతి, పెరియార్ రామస్వామి నాయకర్ అన్నాదురై, ఎం.జి. రామచంద్రన్‌లను ఎంతగానో ప్రేమించారు; గౌరవించారు.

1920-44 మధ్య మద్రాసు రాష్ట్రములో బళ్ళారి, తంజావూర్, కడలూరు, కన్నమూర్, తిరుచి

# గ్రంథ సమర్పణోత్సవము
# సరస్వతీ గ్రంథాలయము

సరస్వతీ!

నిన్ను ఈ గ్రంథాలయములో 1911 లో నిల్పిరి నా గురువు శ్రీ జంపని ఆంజనేయులు, నా మేనమామ శ్రీ పాములపాటి రామస్వామి ఆరాధించిరి శ్రీ కట్టా సుబ్బరామయ్య, నన్నపనేని అంకప్ప, మల్లయ్య.

నీవల్లనేగదా నాకు చదువుపై మనసు కల్గినది. నీవే లేకుంటే అజ్ఞానుడనై, పార్లమెంటుపెద్దనై, దేశనాయకుడనై, దరిద్రనారాయణ సేవకుడనగుదునా?

నీ ద్వారా వివేకానందుడు, రామతీర్థ, వీరేశలింగం, గాంధి తరాల సందేశాలను సోదరులం అందుకో గల్గితిమి.

భారతీదేవి రాష్ట్ర శాసన మండలిలో, నేను పార్లమెంటులో 1930 నుండి ఉంటిమి. ప్రపంచం పలుమార్లు చుట్టితి. ప్రజాస్వామ్య, పార్లమెంటు ధర్మముల ప్రపంచసభలలో నిర్వచించితి. రైతు కూలీ ప్రజారాజ్యాశయమును అందించితి. మహాత్ముని శాంతి సందేశమును, శతాబ్దజయంతి అంతర్జాతీయ సభలో ప్రబోధించితి. ఈనాటికీ దీనులు శ్రామికుల కొరకే శ్రమించుచున్నాను.

యువతరాలకై విద్యాలయములు, గ్రంథాలయములు విరివిగా కావాలి. అంతటా పండితులగుటకు అర్హత పొందాలి. అందుకే నీవు అంతటా వెల్గాలి.

వేయికి మించిన గ్రంథాలను (1951-70) బుచ్చినాయుడు కాలేజీ ద్వారా నీ బిడ్డలకు అందించితిని.

ఈనాడు ఈ వంద గ్రంథాలు ఆ పార్లమెంటు నుండి ఈ పంచాయితీ రాజ్యమునకు తెస్తూవున్నా! నీ పాదకములపై అర్పించుచున్నా. అందుకో..నా ఈ కానుకను.

"భారతీ, భగవతీ, పూర్ణేందు బింబాననా" పోతన్న.

రామానీడు విద్యాలయం
నిడుబ్రోలు
15—7—1976

రంగ
భారతీయ రైతాంగ విద్యాపీఠం

నాపల్లి, వెల్లూరు సెంట్రల్ జెయిళ్ళు స్వాతంత్ర్య యోధుల మధ్య మైత్రీ సద్భావాలు పెంపొందించడానికి దోహదం చేశాయి. వెల్లూరు, తంజావూరు జైళ్ళలో నేను రాజకీయ తరగతులు నిర్వహించాను.

రాజాజీ, ప్రకాశం, కేలప్పన్, వైద్యనాథయ్యర్ అబ్దుల్ రహమాన్, మాధవ మీనన్, సాంబమూర్తి రామన్ నాయర్, సి. సుబ్రహ్మణ్యం, స్వామి సీతారామ్, ఋషిరాసులింగం, గిరి, గోపాలరెడ్డి మొదలైన హేమాహేమీలతోపాటు రాజకీయ ఖైదీగావుండే అవకాశం లభించింది.

కుమారస్వామి రాజా, రామస్వామి రెడ్డియార్, కామరాజ్ నాడార్, భక్తవత్సలం మద్రాసు ముఖ్య మంత్రులుగా పనిచేశారు. అలాగే తమిళనాడు పి.సి.సి అధ్యక్షులు శ్రీ ఒబైదుల్లా వీరందరూ కూడా నా జెయిల్ మేట్స్.

అదేవిధంగా భారతీదేవి రంగ, శ్రీమతి కజిన్స్, అంబుజమ్మ, కుట్టి అమ్మాళ్, కనకమ్మ, లక్ష్మీనాయమ్మ, దుర్గాబాయమ్మ, తాయారమ్మ మొదలైనవారితో వెల్లూరు జైయిల్ లో వున్నారు.

కాగా, ఈమధ్య మద్రాసులో జరిగిన ఎ.ఐ.సి.సి. సమావేశాలు ఆ పాత స్మృతులన్నింటిని మన మనో వీధులలోకి తెస్తున్నాయి. ఇది చరిత్రాత్మకమైన సమావేశం.

